## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరవిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120000706

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

**Subject**

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

**Language**

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖



మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

గురువుగారు ఆశ్రమ ఆవరణలో అటూ - ఇటూ నడవడం ప్రియ శిష్యుడైన ఆల్ ముఖాడా చూశాడు. పాలిపోయిన ఆయన ముఖం మీద గాఢమైన దుఃఖ ఛాయలు గోచరించాయి. అతను గురువుగారిని సమీపించి, 'అల్లా' పేరు మీదుగా ఆయనకు నమస్కరించి—

"గురూజీ, మీరెందుకు విచారంగా వున్నారు?" అని అడిగాడు. ఆయన చేతికర్ర సాయంతో నడచి వచ్చి, అతన్ని కొలను గట్టున వున్న రాతిబండపై కూర్చోమని సౌంజ్ఞ చేయగా అతడు కూర్చుని, గురువుగారి కథ వినడానికి సిద్ధంగావున్నాడు.

గురువుగారు తన కథ చెప్ప నారంభించారు:

"నా హృదయ రంగస్థలంపై రాత్రిం - బవళ్ళు స్మృతి ప్రదర్శించే విషాదాంత గాథను వినిపించమని నువ్వు నన్ను కోరుతున్నావు. నా దీర్ఘ మౌనానికీ, ఎన్నడూ వ్యక్త పరచని నా రహస్యానికి నువ్వు అలసిపోయావు. నా నిట్టూర్పులకూ, విచారాలకూ నువ్వు కలత చెంది "కష్ట సమయంలోనైనా గురువుగారు నన్ను తమ దుఃఖాలయంలోకి ప్రవేశింపనీయక పోతే, ఇంక నేనెట్లా వారి అనుగ్రహ గృహంలో ప్రవేశించగలను!" అని నీలో నువ్వు ఆరాటపడుతున్నావు. అవునా? అయితే, నా కథ విను...బాగా ఆలకించు. నాపై జాలి పడకు. "జాలి" అనేది బలహీనుల కొరకే ఉద్దేశింపబడింది. నా బాధల్లో నేనింకా దృఢంగా వున్నాను.

“నా యవ్వన కాలం నుంచీ నిద్రలో - మెలకువలో అసాధారణమైన ఒక వింత స్త్రీ మూర్తి నన్ను వెన్నంటి తిరిగేది. రాత్రి నేను ఒంటరిగా వున్నప్పుడు, ఆమె నా శయ్య పక్కన కూర్చుని వుండటం నేను చూశాను. అర్ధరాత్రి నిశ్శబ్దంలో, ఆమె అమరవాణి విన్నాను. నేను కళ్ళు మూసుకుని పడుకున్నప్పుడు, నా పెదవులపై ఆమె మృదువైన వేళ్ళ స్పర్శానుభూతి పొందేవాడిని. కాని, కళ్ళు తెరచినప్పుడు, భయాందోళనతో వుండేవాడిని. అ డప్పుడూ అకస్మాత్తుగా వినిపించే వింత శబ్దాలను జాగ్రత్తగా వినే వాడిని.

“అర్థంకాని అస్పష్టతలోపడి నన్ను నేను పోగొట్టుకు నా భ్రమ, నన్నో చపలచిత్తుణ్ణి చేసిందా? మధుర స్వరం- మృదు స్పర్శతో కూడిన శక్తివంతమైన ఒక కొత్త దైవ నా కలల లోంచి కల్పించుకున్నానా? ఇంద్రియ జ్ఞానాన్ని పోగొట్టుకుని, పిచ్చివాడినై! ఆ ఉన్మత్త స్థితిలో ప్రియాతి ప్రియంగా ప్రేమించేందుకై ఈ ప్రియురాల్ని సృష్టించు కున్నానా? ఆమెనే పూజార్హమైన ప్రతిమగా భావించి, ఆమెతో ఏకాంతవాసం గడపాలని అభిలషించి, మనుష్యుల నుంచీ - పట్టణ రొద నుంచీ నాకు నేను దూరమయ్యానా? ఆమెను మరింత సన్నిహితంగా దర్శిం డానికీ, ఆమె అమరవాణి అతి స్పష్టంగా వినడానికీ సమ చరాచరాలకూ, వాటి ఆవశ్యకతలకూ నాకు నేనై కళ్ళు- చెవులు మూసుకున్నానా?” అని తరచు నాలో నేను ఆశ్చ అనుకునే వాడిని.

"ఒంటరిగా ఉండటానికి ఇష్టపడి, మళ్ళా ఆ ఏకాంతపు పిశాచాల నుంచి తప్పించుకునేందుకు ఒక చెలికత్తెనూ, జీవితానికో అర్ధాంగిని ఏర్పరచుకున్న పిచ్చివాడినా?" అని నేను అప్పుడప్పుడూ ఆశ్చర్యపడకపోలేదు.
నేను "భార్య" అనే మాట ఉపయోగించినందుకు నువ్వు

ఆశ్చర్యపడతావు. కాని, మనం కొన్ని విషయాలు అసంభవమని నిరాకరించ యత్నించినా, అవి నిజంగా మన మనసులోంచి తొలగించలేని కొన్ని వింత అనుభవాలు. అవి మనల్ని తరచు కలవరపెడుతూ వుంటాయి.

"నా జీవిత సుఖ - దుఃఖా లన్నింటినీ నాతోపాటు సమంగా పంచుకున్న ఆ, నా స్త్రీ నిశ్చయంగా, నా భార్యే! నేను ఉదయం మేల్కోగానే, ఆమె నా తలగడ మీదకు వొంగి, దయతో - మాతృ ప్రేమతో మెరిసే కళ్ళతో నా వంక తదేకంగా చూడ్డం, నేను చూశాను. నేను ఏదైనా పని చేయాలనుకుంటే, ఆమె వెంటనే నాతో కలిసి, ఆ పని పూర్తి చేయడానికి నాకు తోడ్పడేది. నేను భోజనానికి కూర్చుంటే, ఆమె నాతోపాటు కూర్చునేది. మేము ఒకరి ఆలోచనల్ని, ఒకరం పంచుకునే వాళ్ళం. ఒకరి ఆజ్ఞల్ని, ఒకరం పాటించే వాళ్ళం. సాయంత్రం వరకు ఆమె నాతో వుండి, "ఇక్కడ చాలాసేపు కూర్చున్నాం. పొలాల్లోకి, పచ్చిక మైదానాల్లోకి వెళ్ళి, తిరిగి వద్దామా?" అనేది. నేను వెంటనే చేస్తున్న పనిని ఆపేసి, ఆమె వెంట వెళ్ళే వాడిని. కొంత దూరం వెళ్ళి, ఎత్తైన కొండరాయి మీద కూర్చుని, దిగంతాల్ని చూసే వాళ్ళం. మేలిమి వన్నెతో మెరిసే మేఘాలను ఆమె నాకు చూపించేది. రాత్రి గూటికి

వెళ్ళేముందు తమకు స్వేచ్ఛకు - శాంతిని కానుకగా
ప్రసాదించిన ప్రభువుకు కృతజ్ఞత చెప్పుకుంటూ,
పక్షులు పాడే చివరి పాటలకు నన్ను ఎరుకలో వుంచేది.

నేను చాలాసార్లు ఆరాటాల్లో, కలతల్లో వున్నప్పుడు, ఆమె నా గదికి వచ్చేది. ఆమెను చూడగానే, నా వ్యాకులతలు, ప్రశాంతంగా, ఆనందంగా మారిపోయేవి. మనిషి యెడల మనిషి చేసే అన్యాయాలకు, నా అంతరంగం ఎదురు తిరిగేది. అటువంటి అన్యాయ పరుల నుంచి నేను తప్పించుకుని వెళ్ళిపోతూ వుంటే, వాళ్ళ మధ్య ఆమె ముఖం కనుపించేది. వెంటనే నా హృదయంలో ఆరాటపు తుఫాను అణగేది. దాని స్థానంలో, శాంతమైన అమర గానం నిలిచేది. నేను ఒంటరిగ వున్నప్పుటూ, జీవితపు నిశిత బాణాలు నా హృదయాన వాడిగా గుచ్చుకున్నప్పుడూ, జీవన శృంఖలాలచేత నేను భూమికి బందీనైనప్పుడూ ఆమె నా వంక ప్రేమగా చూడ్డం చూశాను. వెంటనే నా దుఃఖం, ఆనందంగా మారి, జీవితం ఆనందోద్యాన వనంలాగ తోచేది.

"అటువంటి వింత పరిస్థితులతో మీరు ఏ విధంగా తృప్తి పడ్డారు? జీవితం గంతులు వేసే యవ్వన కాలంలో మీ వంటి వ్యక్తి, భూతాలతో - కలలతో ఏ విధంగా ఆనందాన్ని అనుభవించారు?" అని నువ్వు నన్ను అడగవచ్చు. కాని, "జీవితం - అందం - ఆనందం - శాంతి," అనే వాటి గురించి తెలుసుకోవడానికి నేను ఆ స్థితిలో గడిపిన సంవత్సరాలన్నీ నా జీవితంలో మైలు రాళ్ళని నేను నీకు గట్టిగా చెప్పగలను.

"నా మనోకల్పిత నేస్తమూ, నేనూ సూర్యుని ముందు స్వేచ్ఛగా కదలాడే ఆలోచనలు మాదిరిగా వుండేవాళ్ళం. ఆత్మను ఉపశమింపజేసే వర్ణనాతీతమైన అందం వైపు ఉపశమింపజేసే శాంతి గీతాల్ని వెన్నెట్లో ఆలాపిస్తో, నీళ్ళపై తేలి ఆడే వాళ్ళం.

ఆత్మ ద్వారా గ్రహించి, అనుభవించేదే, జీవితం. కానీ, మన చుట్టూ వున్న ఈ ప్రపంచాన్ని అవగాహన - వివేకాల ద్వారా తెలుసుకుంటాం. ఆ అనుభవ జ్ఞానం గొప్ప ఆనందాన్నో, దుఃఖాన్నో ఇస్తుంది. నాకు ముఫ్ఫై సంవత్స రాలు నిండక ముందు నేను అనుభవించిందంతా దుఃఖమే! నా హృదయ రుధిరాన్ని, నా జీవనసారాన్ని పీల్చేసిన ఆ ముఫ్ఫై సంవత్సరాలూ నిండకుండా నేను మరణించి వుంటే, ఎప్పటికీ పక్షులు గూళ్ళు కట్టని, మలయ మారుతం చొరని మోడుచెట్టు వలె వుండేది, నా బ్రతుకు," అని, గురువుగారు కొంత విశ్రమించి, శిష్యుని పక్కన కూర్చుని, తిరిగి తన కథ చెప్ప నారంభించారు:

"ఇరవై సంవత్సరాల క్రిందట మౌంట్ లెబనాన్ గవర్నరు, వెనిస్ నగర మేయర్ని "కాన్‌స్టాంటినోపిల్"లో కలుసుకున్నారు. ఆ పరిచయాన్ని పురస్కరించుకుని గవర్నరు నాకు ఒక సిఫారసు ఉత్తరం ఇచ్చి, సాహిత్య సంబంధమైన ఒక కార్యార్థం నన్ను వెనిస్ నగరం పంపించారు. "నిసాన్" నెలలో, ఇటలీ దేశపు ఓడ ఎక్కి, లెబనాన్ నుంచి బయలుదేరాను. వసంత మారుతం, పరిమళవంతంగా వుంది. తెల్లని మబ్బులు దిగంతం పైన అనేక అందమైన చిత్రాలుగా కనుపించాయి. ఆ ప్రయాణంలో నేను అనుభవించిన ఆనందాన్ని నీకు

ఏ విధంగా వర్ణించి చెప్పగలను? హృదయాంతరాళంలోని భావాల్ని తెలియ జెప్పడానికి మాటలు చాలా అల్పమైనవి, నిస్సారమైనవి.

"నా మనో కల్పిత నేస్తంతో గడిపిన సంవత్సరాలన్నీ ఆనందంగా, శాంతంగా, తృప్తిగా గడిచాయి. భవిష్యత్తులో నాకోసం వేదన వేచి వుందనిగాని, నేను పొందే ఆనందం వెనుక, విషాదం పొంచి వుందనిగాని నేను ఎన్నడూ అనుమానించలేదు.

"నా జన్మభూమి తీరం వెంబడివున్న పర్వతాల్ని, లోయల్ని ఓడలోంచి చూస్తున్నప్పుడు, నా నేస్తం నా పక్కన కూర్చుని వుంది. నేను బీరట్ పట్టణంలో గడిపిన ముచ్చటైన మూడు రోజులూ, ఆమె నాతోనే వుండి, పట్టణ మంతా తిరిగింది. నేను ఆగినచోట, ఆమె కూడా ఆగేది. నన్ను ఏమిత్రుడైనా పలకరిస్తే, ఆమె నవ్వేది. నేను ఒక హోటల్ వరండాలో కూర్చుని, బీరట్ పట్టణ సౌందర్యాన్ని మైమరచి చూస్తుంటే, ఆమె నా పరధ్యానంలో కలిసింది.

"కాని, నేను ఆ పట్టణం నుంచి బయలుదేరుతో వుంటే, ఒక చిత్రమైన సంగతి జరిగింది. ఒక అదృశ్య హస్తం నన్ను గట్టిగా పట్టుకుని, ఆపి, నన్ను వెనక్కిలాగినట్లు అనిపించింది. నేను ఆగాను. వెనక్కి తిరుగు. ముందుకు వెళ్ళకు. వెనక్కి తిరిగి వెళ్ళిపో!" అని ఒక వాణి నాలో నెమ్మదిగా వినిపించింది.

"నేను ఆ మాటల్ని లక్ష్యపెట్టకుండా, ఓడ ఎక్కాను. తెరచాప ఎత్తారు. ఓడ కదిలింది. డేగ, తన వాడి గోళ్ళతో ఒక చిన్న పిట్టను అకస్మాత్తుగా ఆకాశంలోకి తన్నుకుపోతే, పసిపిట్ట

స్థితి ఎట్లా వుంటుందో, అట్లాంటి అనుభూతి కలిగింది నాకు, ఆ మరుక్షణంలో.

సాయంత్రాలు ఓడ ముఖ భాగాన ఒంటరిగా కూర్చుని, దిగంతాల వరకు వ్యాపించి వున్న లెబనాన్ పర్వత సౌందర్యాన్ని తిలకిస్తూ, నా కలల కన్య కొరకు, నా అర్ధాంగి కొరకు, నా హృదయం ప్రేమించిన స్త్రీ కొరకు చుట్టూ చూసే వాడిని. నేను ఎప్పుడు ఆకాశం వంక చూస్తే, అప్పుడు ఎవరి ముఖ దర్శనమయ్యేదో - అర్ధరాత్రి నిశ్శబ్దంలో నేను ఎవరి కంఠస్వరం వినే వాడినో, బీరట్ పట్టణ వీధుల్లో నేను ఎవరి చేతిని పట్టుకుని తిరిగానో ఆ గగన సుందరి ఆ నాటి నుంచి నాతో లేదు.

అగాధ సముద్రంలో, పయనించే ఆ ఓడలో నేను పూర్తి ఒంటరిగా వున్నానని అనిపించింది. హృదయంలో ఆమెను పిలుస్తో, ఆమె ముఖాన్ని చూడాలనే ఆశతో సముద్ర అలల వంక తదేకంగా చూస్తో, ఓడపై పచార్లు చేసేవాడిని. కాని, నా ఆశా - ప్రయత్నాలన్నీ వ్యర్థమైనాయి. అర్ధరాత్రి— ప్రయాణీకు లంతా నిద్రపోతున్నప్పుడు నేను ఆమె దర్శనం కోసం ఆరాటపడుతో, వ్యాకులపడుతో వుండే వాడిని.

ఒకసారి అకస్మాత్తుగా ఆకాశంవంక చూశాను. ఓడకు కొంచెం ఎత్తులో - మబ్బుల మధ్య నా జీవన సహచారిణి కనుపించింది. నేను సంతోషంతో గంతులువేస్తో చేతులు జాచి! "ప్రియతమా, నన్ను ఎందుకు విడిచి వెళ్ళావు. నన్ను ఒంటరిగా వదలి వెళ్ళకు," అని గట్టిగా అరిచాను.

ఆమె కదలలేదు. ఆమె ముఖాన అంతకుముందు ఎన్న
బాధాచిహ్నాల్ని - దుఃఖఛాయల్ని చూశాను. విచారకరమై
కంఠస్వరంతో, "నిన్ను ఒకసారి చూసి. వెడదామని,
మహాసముద్ర అగాధంలోంచి వచ్చాను. నువ్వు కిందికి వె
కలలు కంటూ, హాయిగా నిద్రపో," అన్నది ఆమె మెల్లగ

ఆ మాటలు అంటూ ఆమె మేఘాల్లో కలసి, అదృశ్యమైం
ఆకలిగొన్న పసిబిడ్డ వలె, ఆమెను వెర్రిగా పిలిచాను. ఆ
కోసం చేతులు జాచాను. కాని, నా చేతులు మంచుతో
బరువెక్కిన గాలినే కావలించుకున్నాయి.

తీవ్ర కోపంతో వున్న మూలశక్తుల ఆటు - పోటులన్నీ
వున్నట్లు భావించుకుంటూ, గదికి వెళ్ళాను. "దిగ్భ్రమ -
అనే తుఫాను సముద్రాల అల్లకల్లోలంలో పయనించే ఓడలో
ఒంటరిగా వున్నట్లుంది, నా పరిస్థితి.

నేను గదికి వెళ్ళి మంచం మీద వాలానో లేదో, చాలా చి
గాఢనిద్రలో మునిగిపోయాను. ఆ నిద్రలో నాకొక కలవ
ఆ కలలో ఒక ఛాపిల్ చెట్టు, శిలవ మాదిరిగా వుంది.
ఆ శిలవపై నా జీవిత సహచారిణి వేళ్ళాడుతోంది.
ఆమె చేతుల నుంచి, కాళ్ళ నుంచి కారిన నెత్తురు, చుక్క
చెట్టు చుట్టూ రాలిన పువ్వుల మీద పడ్డాయి.

మా ఓడ రాత్రిం - బవళ్ళు ప్రయాణం చేస్తున్నా, నేను
దూర దేశం వెళ్ళే మానవుడనో లేక, మేఘావృతమైన
ఆకాశంలో అడ్డంగా కదలాడే ఒక పిశాచాన్నో నాకే
నిశ్చయంగా తెలియని మైమరపులో వున్నాను, అన్ని రో

ఆమె మృదు భాషణ కోసం, ఆమె ముఖ దర్శనం కోసం, నా పెదవుల మీద ఆమె చేతి వేళ్ళ మృదు స్పర్శానుభూతి కోసం ఈశ్వరుణ్ణి ప్రార్థించాను.

పద్నాల్గు రోజులు గడచినా, నేను ఒంటరిగానే వున్నాను. పదిహేనవ రోజు మధ్యాహ్నం వేళకు, మా ఓడ ఇటలీ దేశం సమీపించింది. మునిచీకటి వేళకు, వెనిస్ పట్టణం చేరుకున్నాం. అందంగా అలంకరించబడ్డ చిన్న - చిన్న పడవలు గుంపులు, గుంపులుగా మా ఓడ దగ్గరకు వచ్చాయి. పట్నానికి వెళ్ళే ప్రయాణీకుల్ని ఆ పడవల వాళ్ళు ప్రేమగా పలకరించారు, తమ, తమ పడవల్లో తీసుకువెడతామని.

వెనిస్ పట్టణం దగ్గర దగ్గరగావున్న అనేక ద్వీపాల మధ్య నిర్మాణమై వుంది. కాలువలే, దాని వీధులు. చిన్న - చిన్న పడవలే, ప్రజల ప్రయాణ సాధనాలు. పట్టణంలోని అనేక భవనాలు - నివాస గృహాలు కాలవ గట్లనే కట్టారు.

నేను మేయరుగారి ఇంటికి వెళ్ళాలని పడవవానితో చెప్పాను. నా మాట విని అతడు ఆశ్చర్యపోయి, నా వంక తదేకంగా చూశాడు. రాత్రి, తన నల్లని ఉత్తరీయాన్ని పట్టణంమీద కప్పింది. భవనాల, చర్చిల తెరచుకున్న కిటికీల లోంచి దీపాలు మిణుకు - మిణుకుమంటూ కనుపించాయి. నీటిలో ఆ దీపాల ప్రతిబింబాలు - కవి కలలు, ప్రకృతి ఒకసారి అతి సుందరంగా, మరొకసారి మనోహరంగా కనిపించి నట్లు, ఆ పట్టణం నా కళ్ళముందు తళుక్కుమన్నది.

రెండు కాలువలు కలుసుకున్న ఒకచోటకు మా పడవ చేరుకోగానే, చర్చి గంటలు, విచారకరంగా మోగడం వినిపించింది. ఆ సమయానికి నేను పరలోక సంబంధమైన పారవశ్యంలో మునిగి, ప్రాపంచిక విషయాలకు దూరంగా వున్నా, దీనమైన ఆ చర్చి గంటల సవ్వడికి నా ఉత్తేజాలన్నీ అణగిపోయాయి.

ఒకచోట - పాలరాతి మెట్ల దగ్గర, మా పడవ అతను పడవను ఆపి, కట్టేశాడు. చదునుచేసి, చక్కగా రాళ్ళు పరచిన బాట చివర - తోట మధ్య - దేదీప్యమానంగా వెలిగిపోతున్న ఒక పెద్ద భవనాన్ని నాకు చూపిస్తూ, "అదే, మేయరుగారి భవనం," అన్నాడు. నేను ఆ మెట్లన్నీఎక్కి, సింహద్వారం చే పడవ అతను నా సామాన్లతో వెనక వచ్చాడు. అతనికి ఇవ్వవలసిన డబ్బు ఇచ్చేసి, నా కృతజ్ఞత చెప్పుకుని, అతన్ని పంపించేశాను.

సింహద్వారం బైట గంట మోగించాను. ద్వారం తెరచుకుం లోపల అడుగుపెట్టాను. ఏడ్పులు వినిపించాయి. ఉలిక్కి పడ్డాను. విస్మయం చెందాను. అంతలో వయసు మళ్ళిన ఒక నౌకరు నా దగ్గరకు వచ్చి, దుఃఖ భూయిష్టమైన స్వరంతో, "మీరెవరు? మీకేం కావాలి?" అని ఆప్యాయంగా పలకరించాడు. "ఇది మేయరుగారి భవనమేనా?" అని అడిగాను. అతడు తల కొంచెం కిందికి వంచి, అవునన్నట్లు వూపాడు. లెబనాన్ గవర్నరు నాకు ఇచ్చిన ఉత్తరాన్ని అతని చేతికి ఇచ్చాను. అతడు దాన్ని లోపలకు తీసుకువెళ్ళాడ

అంతలో అటు వెడుతున్న ఒక పడుచు నౌకర్ని పిలిచి, "భవనమంతా దుఃఖమయంగా వుండటానికి కారణం

ఏమిటి?" అని అడిగాను. దానికి అతడు, ఈరోజు మేయరుగారి కుమార్తె చనిపోయింది," అని చెప్పి, రెండు చేతులతో ముఖం మూసుకుని గొల్లుమన్నాడు.

నా ప్రయాణ కాలమంతా ఆశ - నిరాశల మధ్య ఊగిసలాడింది. చివరికి నేను చేరుకున్నచోటు, దుఃఖమయంగా వుంది. "దుఃఖం - శోకం" అనే పిశాచాలూ, శ్వేతవర్ణపు రెక్కలు కల మృత్యువూ ఎదురై, నన్ను ఆహ్వానిస్తే, అతిథి గృహంలో సత్కారం ఆపేక్షించుకున్న నా ఆలోచనలు - భావాలు ఎట్లా వుంటాయో, యోచించు.

అంతలో ముసలి నౌకరు తిరిగివచ్చి, తలవంచి, "మీ రాక కొరకు మేయరుగారు ఎదురు చూస్తున్నారు," అని చెప్పి, వెనక్కి తిరిగాడు.

నేను అతన్ని అనుసరించాను. వరండా చివరనున్న గదిముందు అతడు ఆగి, నన్ను లోపలకు వెళ్ళమని సైగచేశాడు. నేను గది లోపలకు వెళ్ళాను. గది లోపల కొంతమంది మత గురువులు - ఉన్నతోద్యోగులు— మౌనంగా కూర్చుని వున్నారు. వారి మధ్య నుంచి— జుట్టు బాగా నెరసిన, పొడుగాటి గెడ్డం కల వయోవృద్ధులు ఒకరు లేచి, నన్ను ప్రేమగా పలకరించి, నా చేతిని, తన చేతుల్లోకి తీసుకుని, "ప్రేమాస్పదురాలైన మా కుమార్తె ఈ రోజున మమ్మల్ని శోకంలో ముంచి వెళ్ళిపోయింది. ఈరోజే మీరు దూరదేశం నుంచి మా అతిథిగా రావడం మా దురదృష్టం. దుఃఖంతో మిమ్మల్ని ఆహ్వానించడం, విచారకమైన సంగతి. అయినా మా దుఃఖం, మీ రాయబారానికి అంతరాయం

కలిగించవని నా నమ్మకం. నా అధికారంలో
వున్నంతవరకు, అన్నీ మీకు ముందుగా, సక్రమంగా
నెరవేరేటట్లు చూడగలను," అన్నారు.

ఆయన దయకు నా కృతజ్ఞత తెలుపుతూ, నా గాఢ
సంతాపాన్ని వ్యక్తపరుస్తూ, నేనూ వారిలో కలిసిపోయాను.

దుఃఖభూయిష్టమైన వారి వదనాలవంక తదేకంగా
చూడ్డంవల్లా, బాధాకరమైన వారి నిట్టూర్పులు వినడం
వల్లా, నా హృదయం దుఃఖంతో, విచారంతో
ముడుచుకుపోయింది.

మేయరుగారిని పరామర్శించడానికి వచ్చిన పెద్దలు
ఒకరి తర్వాత ఒకరు, ఆయన వద్ద శలవు తీసుకుని
వెళ్ళిపోయారు. చివరికి ఆ గదిలో నేనూ,
శోకోపహతులైన ఆ మేయరుగారూ మిగిలాము. నేనూ
వెళ్ళడానికి లేచాను. ఆయన నా వీపుమీద ప్రేమగా
చెయ్యివేసి, "నా ప్రియమిత్రమా, మీరు మా దుఃఖాన్ని
భరించగలిగితే, మా అతిథిగా వుండమని మిమ్మల్ని
వేడుకుంటున్నాను. మీరు వెళ్ళవద్దు," అన్నారు
చాలా దయగా.

ఆయన మాటలు నన్ను ఎంతో కదిలించాయి. నేను
ఒప్పుదలతో తలవంచాను. ఆయన మళ్ళా అన్నారు:
"లెబనాన్ దేశీయులైన మీరు, మీ దేశంలో
విదేశీయులయెడ ఎంతో దాతృత్వం చూపుతారు.
అటువంటి దేశం నుంచి వచ్చిన మీ యెడల, మేము
తక్కువ ప్రేమ చూపినా, మర్యాద లోపం చేసినా

మా కర్తవ్య నిర్వహణలో ఉపేక్ష చేసిన వారము అవుతాము.” అని ఒక గంట మోగించారు. అది విని అంతఃపుర సంరక్షకుడు వచ్చాడు, అతి మనోహర మైన దుస్తుల్లో. అతన్ని ఉద్దేశించి, “వీరికి తూర్పు భాగంలోని అతిథి గృహం ఏర్పాటు చేయండి. వీరు మనతో వున్నంత కాలం, తగిన జాగ్రత్తలు తీసుకోండి,” అన్నారు.

ఆయన ఆజ్ఞానుసారం అతడు నన్ను విశాలమూ, వైభవోపేతమూ అయిన ఒక గృహంలో ప్రవేశపెట్టి వెళ్ళిపోయాడు. ఆ క్షణం వరకు నా ప్రయాణకాలంలో తటస్థపడ్డ సంఘటనలనన్నిం టినీ జ్ఞప్తికి తెచ్చుకుంటో, పరిశీలనగా చూసుకుం టో, అందున్న మంచంమీద కూలబడ్డాను.

కొంతసేపటికి ఆ సంరక్షకుడు వెండిపళ్ళెంలో నాకు భోజనం తీసుకొచ్చాడు. నేను భోజనం చేసి, గదిలో అటూ - ఇటూ తిరుగుతూ, మధ్య - మధ్య కిటికీ దగ్గర ఆగుతూ వెనిస్ ఆకాశాన్ని చూస్తో, పడవవాళ్ళ మాటల్ని, పడవ తెడ్ల లయబద్ధమైన శబ్దాల్ని వింటో నిద్రమత్తుగా వుంటే, మంచం మీద ఒరిగాను. పడుకున్నానో లేదో క్షణంలో మగత నిద్ర లో మునిగిపోయాను. ఆ మగతలో జాగరూకత లోని శాంతం, నిద్రమత్తూ కలిసిపోయాయి.

ఆత్మ సంచరించే అపార ఆవరణలో, మానవుడు కనుక్కున్న కాలమానం ప్రకారం - ఆ స్థితిలో నేను ఎన్ని గంటలు

వున్నానో నాకు తెలియదు. నేను అప్పుడు అనుభవించిన దాన్ని అంతా ఇప్పుడు జ్ఞప్తికి తెచ్చుకుని నన్ను నేను చూసుకోవడం దౌర్భాగ్యమైన స్థితి.

ఆ నిద్రలో ఒక పిశాచమో - దెయ్యమో - శక్తో - ఏదో అది నా చుట్టూ తిరుగుతూ నన్ను పిలిచి, తట్టి లేపినట్లు అనిపించింది. అకస్మాత్తుగా లేవడంవల్లనో ఏమో, వ్యాకులపడ్డాను. కాని, అక్కడ ఇంద్రియగ్రాహ్య చిహ్నాలేమీ లేవు. ఏదో దివ్యశక్తి ప్రేరేపించి, ఆకర్షించినట్లు లేచి, చావడివైపు నడచి వెళ్ళాను,— కలలోలాగ సంకల్పరహితంగా. కాల - దూరాలకు అతీతమైన ప్రపంచంలో ప్రయాణం చేసి వెళ్ళినట్లుంది, నేను అలా లేచి వెళ్ళడం.

వెళ్ళి, చావడి చివరవున్న ఒక పెద్ద గదిలోకి తలుపులు తెరచుకుని వెళ్ళాను, ఆ గది మధ్య ఒక శవపేటిక వుంది. దాని చుట్టూ తెల్ల పూలగుత్తులూ, మిణుకు— మిణుకు మంటూ వెలిగే కొవ్వొత్తులూ వున్నాయి. నేను ఆ శవపేటిక దగ్గరకు వెళ్ళి, మోకరిల్లి అందున్న శవం వంక చూశాను. విస్మయం చెందాను. అది— ఎవరి శవమో కాదు - నా ప్రియురాలి శవం. నా జీవిత సహచారిణి అక్కడ మృత్యువుతో చల్లబడి, ధవళ వస్త్రాలతో కప్పబడి, తెల్లని పువ్వులతో - యుగాల మౌనంతో కాపాడబడుతోంది.

ఓ ప్రభూ, నువ్వు ప్రేమకీ - జీవితానికీ - మృత్యువుకి ప్రభువువి. మా ఆత్మల సృష్టికర్తవు. మా జీవితాల్ని

వెలుగు - నీడల వైపు నడిపే నాయకుడివి. మా హృదయాల్ని శాంతపరచి, మళ్ళా వాటికి ఆశతో, బాధతో చురుకు పుట్టించే వాడివి. నా చెలికత్తెను, నా జీవిత సహచారిణిని ఇక్కడ తిరిగి ఈ శీతల - నిర్జీవ స్థితిలో చూపించావు, నాకు.

ప్రభో, నువ్వు నన్ను నా జన్మస్థానం నుంచి పెరికి, ఇక్కడ నాటి, జీవితం మీద మృత్యువుకీ, ఆనందం మీద దుఃఖానికీ గల పటు తరశక్తిని నాకు తెలియు జేశావు. నా భగ్నహృదయ ఎడారిలో, ఒక తెల్ల కలువను నాటావు. వాడిపోయిన ఆ తెల్ల కలువపువ్వును నాకు చూపించడానికి, నన్ను ఈ లోయ దగ్గరకు తీసుకువచ్చావు.

జీవనపాత్రతో చేదైనది, నేను తాగి తీరాలన్నది ఈశ్వర నిర్ణయం. ఆయన ఇచ్ఛ నెరవేరుతుంది. అనంతమైన ఈ విశ్వంలో మనం అస్థిరమైన అణువులం. మనం ఈశ్వర నిర్ణయానికి అణగి, అర్పణ కావలసిందే!

మనం ప్రేమిస్తే, ఆ ప్రేమ మననుంచి ఉద్భవించదు.
అసలు ఆ ప్రేమ, మన కోసమూకాదు.
మనం ఆనందిస్తే, ఆ ఆనందం మనలో లేదు.
అది అసలు జీవితంలోనే వుంది.
మనం బాధపడితే, ఆ బాధ మన గాయంలో లేదు.
అది ప్రకృతి హృదయంలో వుంది.

ఈ కథ చెపుతూ, నేను ఏమీ ఫిర్యాదు చేయడం లేదు. ఫిర్యాదు చేసేవాడు, జీవితాన్ని సందేహిస్తాడు. నేను జీవిత దృఢ విశ్వాసం కలవాడిని. జీవన పాత్ర నుంచి నేను తాగిన కషాయాల్లో కలిసివున్న చేదు విలువలో నాకు సమ్మకం వుంది. నా హృదయాన్ని గాయపరచిన, దుఃఖం యొక్క అందంలో కూడా నేను విశ్వాసం వుంచుతాను. నా ఆత్మను అణచే క్రూరహస్తపు అంతిమ కరుణలో నాకు సమ్మకం వుంది.

ఇదీ నాకథ. అంతులేని దాన్ని నేనెట్లా సమాప్తం చేయగల

ఆ దివ్యమంగళ ముఖారవిందాన్ని చూస్తూ, తెల్లవారే వరకు నేను ఆ శవపేటిక ముందు మోకరిల్లే వున్నాను. దుర్భరమై, భారవంతమైన విధి నిర్ణయానికి తలవంచి బాధలు పడుతున్న మానవజాతి బాధల బరువుతో లేచి, నా గదికి వెళ్ళాను.

మూడు వారాల తర్వాత, వెనిస్ నగరాన్ని వదిలేసి, లెబనాన్ వచ్చేశాను. ఆ మూడు వారాలూ "గతం" అనే గాఢ నిశ్శబ్దంలో - అనంతత్వంలో అనేక సంవత్సరాలుగా తోచాయి.

కాని, ఆ దృశ్యం చెక్కుచెదరకుండా నాలో అట్లానే నిలిచి వుంది. నా జీవిత సహచారిణిని తిరిగి మృత్యువులో చూసినప్పటికీ, ఆమె నాలో నేటికీ సజీవంగా వుంది. ఆమె ప్రభావంతో నేను ఎంతో శ్రమించాను - అభ్యసించాన ఆ నా శ్రమ ఏమిటో - నేను నేర్చుకున్నదేమిటో నా శిష్యుడవైన నీకు బాగా తెలుసు.

నేను తెలుసుకున్న జ్ఞాన - విజ్ఞానాన్ని నా దేశ ప్రజలకు-
పాలకులకు తెలియ జెప్పాలని గట్టిగా ప్రయత్నించాను.
ప్రభుత్వోద్యోగుల - మతాధిపతుల - అన్యాయాల, అక్రమాల,
అధర్మాల కింద నలిగి, అణగారిపోతున్న దేశ ప్రజల
ఆక్రందనాన్ని బెబనాన్ గవర్నరైన అల్ హారీస్ గారి దృష్టికితెచ్చాను.

ప్రజలే దేశ సంపద, సౌభాగ్యం. ప్రజలే దేశానికి మూలాధారం.
తమ పూర్వీకులు దేశాన్ని ఏ విధంగా ప్రేమగా-దయగా-ధర్మంగా
పాలించారో, అదే విధంగా దేశ పాలన చేయమని గవర్నరు
గారికి సలహా ఇచ్చాను. ఏ ప్రభువైనా తన రాజ్యం నుంచి
"ఆగ్రహం - అత్యాశ - అసత్యం - హింస" అనే నాలుగింటినీ
తప్పనిసరిగా బహిష్కరించవలసివుంటుందని కూడా చెప్పాను.

నా సలహాలకు, తక్కిన నా బోధలకూ ప్రభుత్వం నన్ను
దేశం నుంచి బహిష్కరించింది - మతం నుంచి వెలివేసింది.

ఒకరోజు రాత్రి, గవర్నరు అల్ హారీస్ గారి హృదయం
కలత చెందింది. నిద్రపట్టక, కిటికీ దగ్గరకు వెళ్ళి,
ఆకాశం వంకచూసి, దాని అద్భుతానికి ఆశ్చర్యపడి,
దీర్ఘాలోచనలో మునిగి, "ఎంత మంది దైవాంశ సంభూ
తులు ఈ అనంత విశ్వంలో లీనమైపోయారో!
ఎవరు సృష్టించారీ అద్భుతమైన ప్రపంచాన్ని?
గ్రహాల గమనాన్ని ఎవరు ఆజ్ఞాపించారు?
గ్రహాలకూ, మనకూ ఏమిటి సంబంధం? అసలు
నేను ఎవర్ని? నేనెందుకు ఇక్కడ వున్నాను?" అని
తనలో తాను అనుకున్నాడు.

దేశం నుంచి బహిష్కరింపబడ్డ నేను ఆ సమయంలో
ఆయన జ్ఞప్తికి వచ్చాను గావును, తక్షణం నా కోసం
కబురు పంపారు. నన్ను క్షమాపణ వేడుకున్నారు.
రాజలాంఛనాలతో నన్ను గౌరవించి, దేశ ప్రజల
ముందు నన్ను తన సలహాదారుగా ప్రకటించి,
నా చేతిలో ఒక బంగారు తాళంచెవి వుంచారు.

నేను దేశం నుంచి బహిష్కరింపబడ్డందుకు
విచారించడంలేదు. సత్యాన్వేషణ చేసి,
ఆ సత్యాన్ని బహిరంగ పరచాలనుకునే వాడు,
బాధల్ని భరించవలసిందే!
తోటి మానవుల దుఃఖాలను ఎట్లా అర్థం చేసుకో
వాలో, నా దుఃఖాలే నాకు బోధించాయి.
నేను పడ్డ బాధలు కాని, నాకు జరిగిన దేశ - మత
బహిష్కరణ కాని, నా జీవితాన్ని అస్పష్టం చేయలేదు.
నేను ఇంత అలసిపోయాను... ...''

గురువుగారు తన కథ ముగించి, శిష్యుణ్ణి పంపిం చేసి
తన గత స్మృతుల అలసట నుంచి దేహానికీ,
మనసుకీ విశ్రాంతి కోసం ఏకాంత వాసానికి
వెళ్ళిపోయారు.

''అల్ ముఘాడా అంటే - పరివర్తన చెందిన వాడు,'' అని అర్థ

* * *

రెండు వారాల తర్వాత గురువుగారు అస్వస్థులుగా వున్నారని తెలిసి, ఆయన ఆరాధకులు ఆయన్ని పరామర్శించడానికి ఆశ్రమానికి వచ్చారు.
అదే సమయంలో ఆశ్రమంలోంచి ఒక మత గురువు— ఒక సన్యాసిని - ఒక వైద్యుడు - ప్రియశిష్యుడైన ఆల్ముథాడా బైటికి వచ్చారు. ఆల్ముథాడా గురువుగారి మరణవార్త. అక్కడ చేరిన వారికి తెలియజేశాడు. అది విని. వారంతా శోకించారు— దుఃఖించారు. కాని, ఆల్ముథాడా మాత్రం, కన్నీరు పెట్టలేదు. ఇంక ఒక్కమాట, మాట్లాడలేదు.

ఆ తర్వాత అతడు కొలను గట్టునవున్న రాతిబండపై నిలబడి, వారిని ఉద్దేశించి ఇట్లా అన్నాడు:
సోదరులారా, దేశ ప్రజలారా! గురువుగారి మరణ వార్త మీరు ఇప్పుడు విన్నారు కదా? అమరులైన మన గురుదేవులు, లెబనాన్ దేశానికే ప్రవక్త. ఆయన తమకు తాముగా, మహానిర్యాణాన్ని పొందారు.

సమస్త దుఃఖాలకు - విచారాలకు అతీతమైన ఆయన పవిత్ర ఆత్మ స్వర్గంలో నిలిచి, మనల్ని ప్రేమతో చూస్తోంది. దేహబంధాలనూ, భూలోక జీవిత సంబంధమైన విషాదాలను - భారాలను పిసర్జించి వెళ్ళిపోయింది, వారి దివ్యాత్మ.

గురువుగారు ఈ పదార్థ ప్రపంచాన్ని వదిలేసి, బాధలు - కష్టాలు బంధించని మరో ప్రపంచానికి మరలిపోయారు; దివ్య దేహం ధరించి. ఇప్పుడు

ఆయన, మన కళ్ళు చూడలేని - మన చెవులు వినలేని ప్రదేశంలో వున్నారు. ఆయన కావాలని అమర లోక వాసులు తీవ్రంగా కాంక్షించడంచేత, ఆయన అక్కడ నుండి జ్ఞానార్జన చేస్తున్నారు. ఆ లోక చరిత్ర - సౌందర్యం ఆయన్ని ఎప్పుడో మోహింప జేశాయి. ఆ దివ్య భాష అభ్యసించడానికి, ఆయన గట్టి కృషి చేశారు.

ఈ భూమి మీద ఆయన జీవితం - అనేక ఘనకార్యాల తో కూడిన ఒక దీర్ఘమైన గొలుసు. ఆయన జీవనం. నిరంతర ఆలోచనా మయం. శ్రమలో తప్ప, విశ్రాంతి నెరుగని జీవితం వారిది. "శ్రమే, ప్రత్యక్ష ప్రేమ" అని ఆయన నిర్వచించారు - విశ్వసించారు. శ్రమనే ఆయన ప్రేమించారు.

జాగృతి ఒడిలో తప్ప ఆయన విశ్రాంతిని ఎరుగరు. దప్పిక గొన్న ఆత్మ వారిది. ఆయనలో ప్రేమ - దయ గట్టి ష దలతో పొంగి పొరలేవి.

ఈ భూమిమీద ఆయన అటువంటి జీవితం గడిపారు.

శాశ్వతత్వం నుంచి ఆవిర్భవించిన జ్ఞాన స్వరూపమే, మన గురువుగారు. మానవ మేధస్సును ప్రక్షాళనం చేసి, సేదదీర్చే, పవిత్ర వాహినే, ఆయన జీవితం.

ఇప్పుడా జీవనది, శాశ్వత జీవనతీరాన్ని చేరింది. ఆయన్ని ఎరిగినవారు, ఆయన కోసం దుఃఖించరు, కన్నీరు పెట్టరు.

జీవనాలయం ముందు వూరికే నిలబడి,
ఎప్పుడూ తమ నుదుటి చెమటతో భూమిని
ఫలవంతం చేయనివారు చనిపోతే; వారు
మీ కన్నీళ్ళకూ, ఏడ్పులకూ అర్హులనే సంగతి
జ్ఞాపకం ఉంచుకోండి.

కాని, మన గురువుగారి జీవితం, మరొక విధంగా
గడిచింది. జీవితమంతా ఆయన మానవాభ్యుదయం
కోసం శ్రమ పడలేదా? పవిత్రమైన ఆయన
వివేక ఝరి నుంచి, తాగకుండా మీలో ఎవరైనా
వున్నారా? మీరు ఆయన్ని గౌరవించదలిస్తే, ఆయన
పవిత్ర ఆత్మకు స్తుతి - కృతజ్ఞతల జ్ఞానశ్లోకం
ఒకటి అర్పించాలి కాని, విచారకరమైన ఏడ్పుల్ని,
మృత్యు గీతాల్నికాదు. మీరు ఆయనకు తగిన
గౌరవం చూపదలచుకుంటే, మరణ శాసన
పూర్వకంగా ప్రపంచానికి రాసి ఇచ్చిన సొత్తుగా,
ఆయన గ్రంథాల్లోని జ్ఞాన భాగానికి మీ హక్కును
గట్టిగా చెప్పుకోండి.

"మేధావికి ఇవ్వకు. ఆయన్నించి తీసుకో," అన్నట్లు, మీరూ
ఆ విధంగా గురువుగారిని గౌరవించండి. ఆయన కోసం
దుఃఖించకండి. ఆయన విషయమై ఆనందంగా వుండండి.
ఆయన జ్ఞానామృతాన్ని, విరివిగా తాగండి. అదే మీరు
ఆయనకు యుక్తమైన కానుకను చెల్లించే విధం.

అల్ ముఖాడా మాటలు విని, జనసమూహమంతా
పెదవులపై చిరునవ్వులతో, హృదయంలో కృతజ్ఞతా
కృతులతో తమ తమ నెలవులకు వెళ్ళిపోయారు.

ఆల్ ముస్తఫా ఒంటరివాడైపోయాడు. కాని
ప్రేమతో, ఇష్టంతో, స్వేచ్ఛగా తనను వినేవారి హృదయాల్లో
గురు వచనాలనే విత్తనాలను చల్లడమనే కార్యక్రమాన్ని
చేపట్టి, దాన్ని నెరవేర్చాలనే కుతూహలం నిరంతరం
ప్రజ్వరిల్లడం వలన, అతని హృదయాన్ని ఒంటరితనం
ఎప్పుడూ లోబరచుకోలేకపోయింది. గురువుగారి
జ్ఞాన వాక్కుల మీద, అతడు ఆశ్రమ ఆవరణలో
ఒంటరిగా ధ్యాన నిమగ్నుడయ్యాడు.

నలభై రోజుల ధ్యానానంతరం, ఆల్ ముస్తఫా
గురువుగారి ఆశ్రమం వదిలేసి ప్రాచీన
ఫోనీషియా పేటలు, పల్లెలు, పట్టణాలూ తిరిగాడు.

ఒకరోజున బీరట్ పట్టణ అంగడి వీధిలోంచి
వెడుతుండగా, ఒక గుంపు అతన్ని అనుసరించింది.
అతడు, నాలుగు రోడ్లు కలిసినచోట ఆగాడు.
గుంపంతా అతని చుట్టూ మూగింది.
అతడు గురువచనాల్ని వారికి ఇట్లా చెప్పాడు:

"నా హృదయ వృక్షం, ఫలభారంతో వంగివుంది.
ఆకలిగొన్న వారంతా రండి.
వచ్చి, పళ్ళు అన్నీ పోగుజేసి, తిని, తృప్తిపడండి.

రండి. వచ్చి, నా హృదయ దాతృత్వంనుంచి స్వీకరించి,
నా భారాన్ని తగ్గించండి. వెండి - బంగారం బరువులకింద
నా ఆత్మ అలసి వుంది. రండి. దాగివున్న నిధుల్ని

అన్వేషించే మీరు, వచ్చి, మీ సంచుల్ని నింపుకుని,
నన్ను నా భారం నుంచి విముక్తి పరచండి.

యుగాల ద్రాక్ష సారాయితో, నా హృదయం
పొంగి, పొరలుతోంది. రండి. దప్పికగొన్న వారంతా వచ్చి,
తాగి, మీ దాహం తీర్చుకోండి."

మొన్న ఒక రోజున ఒక దృశ్యం చూశాను:
ఒక ఐశ్వర్యవంతుడు దోసిలినిండా వజ్ర - వైడూర్యాలు
పట్టుకుని, దేవాలయ ద్వారంవద్ద నిలబడి,
వచ్చి - పోయే వారివేపు చేతులుజాచి,
"అయ్యా! నామీద దయతలచి, ఈ వజ్రాల్ని తీసుకోండి.
ఇవి, నా ఆత్మకు వ్యాధిని, హృదయానికి కాఠిన్యాన్ని
కలిగించాయి. నన్ను దయతలచి, వీటిని తీసుకుని
నన్ను పరిపూర్ణుణ్ణి చేయండి," అని అర్థించాడు.
కాని, ఏ ఒక్కరూ అతని అభ్యర్థనను లక్ష్యపెట్టలేదు.

ఆ ఐశ్వర్యవంతుని దైన్యావస్థ గమనించి,
బీరట్ పట్టణ వీధుల్లో తిరుగుతూ, వణకే చేతుల్ని
భిక్షకై జాస్తో, సాయంత్రం వట్టిచేతులతో
ఇంటికి చేరుకునే దరిద్రుడుగా జీవించడం
అతనికి నిజంగా ఎంతైనా మంచి సంగతి," అని
నాలో నేను అనుకున్నాను.

ఇంకొక దృశ్యం: ఐశ్వర్యవంతుడు - దాత అయిన
డమాస్కస్ షేక్, అరేబియా ఎడారిలో
ఒక పర్వత పాద పీఠంలో, గుడారాలు వేయించి,
సాయంత్రం తన పరిచారకుల్ని పంపించి,

ఆ దారినిపోయే ప్రయాణీకుల్ని ఆపి, తన
గుడారాలకు తీసుకు రమ్మన్నాడు - ఆ రాత్రి
ఆ బాటసారులకు రక్షణ ఇచ్చి, వినోద పరచాలని.
కాని, ఆరోజు ఆ బాటలన్నీ నిర్జనంగా వుండటం వలన,
వెళ్ళిన సేవకులు ఒక్క బాటసారిని
షేక్ గుడారానికి తీసుకురాలేదు.

చివరికి ఆ రాత్రి ఒంటరిగా మిగిలిపోయిన షేక్
దురవస్థ చూసి, పట్టణం చివర పారేసిన
పులిస్తరాకుల్లోని పదార్థాల్ని మధ్యాహ్న వేళ
తక్కిన వారితో కలిసి ప్రేమగా పంచుకుంటో,
"ఒక చేత్తో కర్రా, మరొక చేత్తో భిక్షా పాత్ర
ధరించి స్వేచ్ఛగా తిరిగే భిక్షుకుడుగా బతకడం
అతనికి ఎంతైనా మేలైన సంగతి," అని
నా హృదయం నాకు చెప్పింది.

మరో దృశ్యం: లెబనాన్ గవర్నరు కుమార్తె
ప్రొద్దుటే లేచి, విలువైన గౌను తొడుక్కుని,
తలపై కస్తూరి చిలకరించుకుని, ఒంటికి అత్తరు
పూసుకుని, తనను ఎవరైనా ప్రేమించే వారు
తటస్థ పడతారేమోననే ఆశతో, తన తండ్రి
ప్రత్యేక ఉద్యానవనంలోకి వెళ్ళింది.
అక్కడ పచ్చిక తివాసీమీది మంచుబొట్లు
ఆమె గౌను అంచును తడిపాయేగాని,
ఆమె తండ్రి ఆధీనంలోవున్న వారెవరూ
ఆమెను ప్రేమించలేదు.

నేను ఆమె దౌర్భాగ్యస్థితి మీద యోచనచేయగా,
ఉదయం గొర్రెల్ని పచ్చిక బయళ్ళకు తోలుకుపోయి,
మట్టి రంపు కొట్టే మొరటు గౌనులో, ద్రాక్ష తీగలు
వేసుకుని, సాయంత్రం ఇంటికి గొర్రెల్ని తోలు కొచ్చే
సామాన్య రైతు కూతురు కావడం, ఆమెకు మంచిది కాదా?
కనీసం రాత్రి నిశ్శబ్దంలో గల గల మంటూ ప్రవహించే
సెలయేటి ఒడ్డున, తన కోసం ఎదురు చూసే ప్రియుణ్ణి
కలుసుకునేందుకు ఇంట్లోంచి రహస్యంగా
జారుకోవడం ఆమెకు ఆనందదాయకం కాదా?"
అంటూ నా ఆత్మ నాకు చెప్పింది.

నా హృదయ వృక్షం ఫల భారంతో వంగి వుంది.
రండి. ఆకలిగొన్న ఆత్మ స్వరూపులారా, రండి.
వచ్చి, నా పళ్ళన్నింటినీ పోగుజేసుకుని, తిని
తృప్తిపడండి. యుగయుగాల ద్రాక్ష సారాయితో
నా ఉత్సాహం పొంగి, పొరలుతోంది. రండి.
హృదయార్తులారా, రండి. వచ్చి, ద్రాక్ష సారాయి తాగి,
మీ దప్పిక తీర్చుకోండి.

గొడ్డుతనపు చేదుకన్నా, పంటనిచ్చే బాధ
క్రూరమైనది కనుక, పువ్వులు పూయని,
పళ్ళు ఇవ్వని చెట్లును నేనైతే బావుండును.
దౌర్భాగ్యుడైన దరిద్రుని దైన్యం కన్నా,
దాతృత్వవంతుడైన ధనవంతుని బాధ
భయంకరమైనది.

నీరు ఎండిన బావిని నేనైతే, బావుండును.
అందులో ప్రజలు రాళ్ళు రువ్వుతారు.

దప్పిక గొన్న పెదవులతో తాకని నిర్మలోదకపు
ఊట కన్నా, ఎండిన బావిగా వుండటం
ఎంతైనా మంచిది.

మానవ పదఘట్టన కింద నలిగే చిన్నరెల్లుపోచను
నేనైతే, బావుండును. చేతి వేళ్ళ కొనలతో
మీటక, దాని నాదానికి ఇంట్లో వారెవరూ
చెవి ఇచ్చి వినక, ఒక మూల పడివుండే
వీణ కన్నా, నలిగిన ఆ రెల్లుపోచ నయం.

ఓ నా మాతృభూమి పుత్రుల్లారా, పుత్రికల్లారా,
నేను చెప్పేది వినండి:
ప్రవక్త వాణిగా మీకు వినవచ్చే ఈ నా మాటల
మీద యోచన చేయండి. మీ హృదయ ఆవరణలో,
ఆ నా మాటలకు చోటు ఇవ్వండి. మీ ఆత్మ
వనంలో వివేక బీజాల్ని వికసించనివ్వండి.
ఎందుకంటే, ప్రభువు ఇచ్చే అమూల్య వరం, అదే!

*　　　*　　　*

అల్ ముఫాడా ఖ్యాతి దేశం నలుమూలలా వ్యాపించింది.
గురు వచనాల్ని బోధించే వానిని వినడానికీ,
అతనికి తగిన గౌరవం చూపడానికీ,
ఇతర దేశాల నుంచి కూడా, చాలా మంది వచ్చారు:

వైద్యులు - న్యాయ శాస్త్రజ్ఞులు - కవులు - తత్వవేత్తలు—
మామూలు ప్రజానీకం—
ఆయన్ని ఎక్కడ కలుసుకుంటే అక్కడ - వీధిలో—

చర్చిలో - మశీదులో - యూదులైనవారు తమ ప్రార్థనా
మందిరాల్లో గుమికూడి, ఆయన్ని ప్రశ్నలతో
ముంచేసే వారు.

ఒకరి పెదవుల నుంచి, మరొకరి పెదవుల మీదకు
దూకే, అందమైన అతని మాటలు
శ్రోతల మనస్సుల్ని వివేకవంతం చేశాయి.

"జీవితం, దాని వాస్తవత్వం" గురించి వారికి చెపుతూ
అతడు ఇట్లా అన్నాడు:
సముద్రం ఉపరితలాన తేలియాడే నురుగు వంటి
వాడు, మానవుడు. గాలి వీచినప్పుడు ఆ నురుగు
ఎప్పుడూ అక్కడ లేనట్లే అదృశ్యమైపోతుంది.
అదే విధంగా, మానవ జీవితాలు మృత్యువుచేత
ఏ జాడా లేకుండా ఎగరకొట్టెయ్య బడతాయి.

జీవిత వాస్తవత్వమే, జీవితం.
దాని ఆది, గర్భంలో లేదు. దాని అంతం, సమాధిలో లేదు.
ఎందుకంటే, గత కాలమంతా శాశ్వత జీవనంలో
ఒక క్షణం. "మృత్యుభీతి" వల్ల కలిగిన జ్ఞానోదయంతో
పోల్చిచూస్తే, ఈ పదార్థ ప్రపంచమంతా
ఒక స్వప్నంలాగ తోస్తుంది.

ప్రతి నవ్వు నవ్వడినీ, హృదయం నుంచి వెలువడిన
ప్రతి నిట్టూర్పునీ మోసుకుపోయే సమీరమే,
ఆనందానికి మూలమైన ప్రతి ముద్దుకి
ప్రత్యుత్తరమిచ్చే వాటి ప్రతిధ్వనుల్ని, భద్ర పరుస్తుంది.

దుఃఖంతో కార్చిన ప్రతి కన్నీటి చుక్కనూ
దేవతలు లెఖ్ఖపెట్టి వుంచుతారు.
ప్రేమ నుంచి వెలువడే ప్రతి ఆనంద గీతాన్ని
అనంత విశ్వంలో సంచరించే ఆత్మల శ్రవణేంద్రియాల
దగ్గరకు, ఆ దేవతలే తీసుకుపోతారు.

ఒకనాటి మన భావ ప్రకంపనల్ని, హృదయ స్పందనల్ని
ముందు కాలంలో చూస్తాం, అనుభవిస్తాం.
నిరాశచేత పురిగొల్పబడి, దైవత్వాన్ని తృణీకరించిన
మనమే, భవిష్యత్తులో ఈశ్వర తత్వాన్ని గ్రహిస్తాం.

అపరాధం వల్ల జరిగిన ఒక కార్యాన్ని "బలహీనం" అని
మనం ఈనాడు అనినప్పటికీ, ఆ కార్యమే
"మానవ జాతి" అనే పూర్తి గొలుసులో
ఒక ముఖ్యమైన కొక్కెంగా భవిష్యత్తులో
ప్రత్యక్షమౌతుంది.

ఒకనాడు మనం చేసిన క్రూరకార్యాలన్ని,
ప్రతిఫలం పొందక, మనతోనే వుండి,
మనకు గొప్పగా దర్శన మిస్తాయి.
వాటికవే శోభ నిచ్చుకుంటో, మనకు ముందుదారి
చూపుతూ, మన ఘనతను ప్రకటిస్తాయి.
మనం అనుభవించిన కష్టాలన్ని, గౌరవనీయమైన
మన తలలమీద, పొన్నపూల మాలలవలె వుంటాయి.

ఆల్ ముథాడా ఈ సంగతులన్ని చెప్పి, గుంపునుంచి నిష్క్ర
శారీరక అలసటనుంచి విశ్రాంతి తీసుకోవాలని
అనుకుంటూవుండగా, ఒక అందమైన అమ్మాయివంక,

ఒక యువకుడు తదేకంగా చూడ్డం, చూశాడు.
ఆ యువకుని చూపులో దిగ్భ్రమ ప్రతిబింబిస్తోంది.
ఆ దృశ్యంచూసి, యువకుణ్ణి ఉద్దేశించి
అతడు ఇట్లా అన్నాడు:

మానవజాతి బహిరంగంగా ప్రకటించే
అనేక విశ్వాసాల వల్ల నువ్వు కలత చెందుతున్నావా?
ఆ నిశ్చయ నమ్మకాల లోయలో నువ్వు తోవ తప్పావా?
అణకువ భారం కన్నా, భిన్నమతావలంబనపు స్వేచ్ఛ,
తక్కువ భారమైనదని భావిస్తున్నావా?
"ఎరుక" అనే కోటకన్నా, భిన్నాభిప్రాయం,
సురక్షితమైనదని అనుకుంటున్నావా?

అలాగైతే, అందాన్ని నీ మతంగా మలచుకుని,
దాన్నే దైవంగా ఆరాధించు.
అందమనేది ఈశ్వర నిర్దేశితమైన రూపకల్పన.
అది మన కంటికి కనుపిస్తుంది - ప్రత్యక్షంగా విశదమౌతుంది.
లోభత్వం, దురహంకారం రెండూ కలిసి,
మోసంగా కూడినటువంటి దైవభక్తితో ఆడుకునే వారిని
పరిత్యజించి, సౌందర్య దేవత యందు విశ్వాసముంచు.
ఆ విశ్వాసంలోనే, ఆనందం కోసమైన నీ వాంఛా,
జీవితారాధనకు మూలమూ వున్నాయి.

జీవన నిలయమైన ప్రకృతి మార్గాల్లో
నీ హృదయానికి గురువుగా, ప్రేమకు దర్పణంగా వున్న
స్త్రీ సింహాసనం దగ్గరకు, నీ హృదయాన్ని చేర్చే
సౌందర్య దేవత ముందు తపస్సు చెయ్యి.
నీ పాపాలకు ప్రాయశ్చిత్తం చేసుకో.

సమావేశమైన గుంపును పంపించేసేముందు
అతడు ఇంకా ఇట్లా అన్నాడు:

ఈ ప్రపంచంలో "నిన్నటి వారు - రేపటి వారు," అని
రెండు రకాల మనుష్యులు వున్నారు.
ఆ రెండింటిలో మీరు దేనికి చెందిన వారు?
మీవంక నన్ను చూడనివ్వండి.
తేజోవంతమైన ప్రపంచంలో ప్రవేశించేవారో, లేక,
అంధకార ఆవరణలో చొరబడేవారో,
నన్ను చూసి తెలుసుకోనివ్వండి.
రండి. వచ్చి, మీరేమిటో, - అసలు మీరెవరో నాకు
చెప్పండి.

"స్వలాభం కోసం స్వదేశాన్ని ఉపయోగించుకుంటాను"
అనే రాజకీయ వేత్తలా, మీరు? అలాగైతే, మీరు,
ఇతరుల మాంసం తిని, బతికే పరాన్న భోక్తలు కాక
మరెవ్వరూ కారు.

విశ్వాస పాత్రుడైన సేవకునివలె
"నేను నా దేశానికి సేవ చెయ్యాలని ఆశిస్తున్నాను" అని
తన అంతరాత్మ శ్రవణేంద్రియంలో నెమ్మదిగా చెప్పుకునే
మిక్కిలి పట్టుదలకల దేశభక్తులా, మీరు?
అలాగైతే, బాటసారుల దప్పిక తీర్చడానికి
ఎడారిలో ఒయాసిస్ వంటివారు.

ప్రజల అవసరాలు గమనించి, ఆ అవకాశాన్ని
ఆసరాగా తీసుకుని, మనస్సంతటితో వడిపెట్టి

ఆకర్షించే విధంగా నిత్యావసర వస్తువుల్ని అమ్మి,
అధిక లాభాలకు అమ్ముజూసే వర్తకులా, మీరు?
అలాగైతే, మీరు దుర్మార్గులు.
మీ నివాసం రాజభవనమైనా, ఖైదు అయినా అదొక విషయమేకాదు.

కర్షకుల - నేతగాళ్ళ ఉత్పత్తి సరకుల మారకం విషయంలో
కడు సమర్థవంతంగా వ్యవహరించి, అమ్మేవారి - కొనేవారి మధ్య
ఆలోచనలు సాగించి, న్యాయ మార్గాన తనకూ - ఇతరులకూ
లాభం చేకూర్చే నీతిపరులా, మీరు?
అలాగైతే, మీరు నిజంగా నీతివంతులే!
మీరు దూషింపబడ్డా, భూషింపబడ్డా అది లెఖ్ఖకాదు.

తన ఒంటికి కావలసిన కాషాయాంబరాన్ని
విశ్వాసపాత్రుల సహజత్వంనుంచీ,
తాను ధరించే బంగారు కిరీటాన్ని సమ్మకస్తుల దయనుంచీ
సంపాదించి, సైతాన్ పురోభివృద్ధిమీద ఆధారపడి,
బతుకుతూ, అప్పుడప్పుడూ ఆ సైతాన్ ద్వేషాన్ని
వెళ్ళగక్కే మతాధిపతులా, మీరు?
అలాగైతే, మీరు భిన్నమతావలంబకులు.
మీరు రోజంతా ఉపవాసమున్నా, రాత్రంతా ప్రార్థించినా
అది గణనీయమైన సంగతి కాదు.

ఈశ్వర రాజ్యాన్నిచేర్చే రాజ్య మార్గాన్ని
హృదయంలో శాశ్వతంగా స్థిరపరచుకున్న విశ్వాసులా, మీరు?
దేశ పురోభివృద్ధికోసం ప్రజల మంచితనంనుంచి
సదవకాశాన్ని ఎదురుచూపే సమ్మకస్తులా, మీరు?
అటువంటి విశ్వాసులే అయితే, "సత్యం" అనే వనంలో

మీరు లిల్లీపువ్వు వంటివారు. మీ పరిమళం
మనుష్యుల మధ్య మసలినా, గాలిలో చెల్లాచెదురైనా
లెఖ్కకాదు. అది ఆకాశంలో శాశ్వతంగా కాపాడబడుతుంది.

కాలక్షేపపు కబుర్లతో - ఇంకా అనేక దురదృష్టాలతో—
నేరాలతో, బానిసల బజారులో నీతి సూత్రాల్ని
అమ్ముకుతిని, బాగా బలిసిన జర్నలిస్ట్‌లా, మీరు?
అలాగైతే, మీరు కుళ్ళిన మాంసం మీదపడి,
అత్యంత ఆకలితో తిని, తిరిగే రాబందుల వంటివారు.

గత విజయాలవల్ల ఆవేశం తెచ్చుకుని,
మానవజాతికి బోధించాలని, ఎత్తుగా వేయబడ్డ
చరిత్ర రంగస్థలంమీద నిలబడి,
తన బోధలకు తగినట్లు అభినయించే బోధకులా, మీరు?
అలాగైతే, రోగాలతో బాధపడే మానవజాతికి
తిరిగి బలాన్ని ఇచ్చే ఓషధుల వంటివారు, మీరు.
గాయపడిన హృదయానికి నవనీతం వంటివారు.

జేబులు దోచుకోవడానికో, లేక స్వార్థంతోనో తప్ప
బైటికి వెళ్ళక, తన ఆధీనంలో వున్నవారిని నీచంగాచూసే
గవర్నరులా, మీరు. అలాగైతే, మీరు "దేశం" అనే
ధాన్యం నూర్చిన కళ్ళంమీద "తారం" వంటివారు.

ప్రజల్ని ప్రేమిస్తూ, వాళ్ళ పురోభివృద్ధి కాంక్షిస్తో
వారిని జాగ్రత్తగా కనిపెట్టి చూస్తో, పట్టుదలతో
పనిచేసే విశ్వాస పాత్రులైన ప్రజాసేవకులా, మీరు?
అలాగైతే, మీరు దేశ ధాన్యాగారాల్లో,
తరగని సంపద వంటివారు.

తాము చేసిన పనులు నీతివంతములైనవిగా,
తమ భార్యలు చేసిన పనులు అవినీతికరములైనవిగా
భావించే భర్తలా మీరు? అలాగైతే, మీరు
గుహల్లో జీవిస్తూ, నగ్నత్వాన్ని తోళ్ళతో కప్పుకునే—
ఎప్పుడో అంతరించిపోయిన అనాగరికుల వంటివారు.

నిరంతరం తనను అంటిపెట్టుకుని వుండే భార్యతో
ప్రతి ఆలోచననూ - ప్రతి పరమానందాన్ని - ప్రతి విజయాన్ని
పంచుకునే భర్తవా, నువ్వు?
అలాగైతే, నువ్వు న్యాయం - వివేకం - విచక్షణలతో
ఉన్నత పథాలకు పురోగమించే దేశాధికారి వద్దకు
సూర్యోదయంవేళ నడచివెళ్ళే ఉత్తముడి వంటివాడివి.

తరతరాలనుంచి విసరి పారవేయబడ్డ గుడ్డ పీలికలతో
నిండిన, "గతం" అనే అగాధపు లోతుల్లో మేధస్సు వుండగా,
తలను మాత్రం గుంపుపై వుంచే రచయితవా?
అలాగైతే నువ్వు, మురికి నీటిగుంట వంటివాడివి.

పనికి మాలిన, అరిగిపోయిన, చెడిపోయిన వాటిని
నిరాకరిస్తో,
ఉపయోగపడే వాటినీ, మంచివాటినీ భద్రపరచుకుంటో
అంతరాత్మను పరిశోధించుకుంటో
తీక్షణంగా ఆలోచించేవాడివా, నువ్వు?
అలాగైతే, నువ్వు ఆకలిగొన్న వారికి, "మన్నా" వంటివాడివి.
దప్పికగొన్న వారికీ, నిర్మలోదకం వంటివాడివి.

అర్థరహిత శబ్ద సమాసాల్ని ఉపయోగించే కవివా, నువ్వు?
అలాగైతే, నువ్వు - తాము ఏడ్చి, ఇతరులను నవ్వించి,
తాము నవ్వి, ఇతరుల్ని ఏడ్పించే వేషధారులలో ఒకడవు.

అమరగానంతో ఆత్మను ఉపశమింప జేయడానికి
ఈశ్వరుడు ఇచ్చిన వీణతో తన తోటివారిని
జీవితం దగ్గరకూ - జీవన సౌందర్యం దగ్గరకు
తీసుకుపోయే మహాత్ములలో ఒకడివా, నువ్వు?
అలాగైతే, నువ్వు, మానవజాతి మార్గాన్ని
వెలిగించే కాగడా వంటివాడివి. వారి హృదయాల్లో
మధుర వాంఛ వంటివాడివి. వారి కలల్లో
దైవత్వాన్ని బహిరంగపరిచే వాడివి.

ఆ విధంగా మానవజాతి రెండు భాగాలుగా విభజింపబడి
వుంది.
నిజానికి అగాధంలో దిగుతున్నప్పటికీ,
పర్వత శిఖరం చేరుతున్నట్లు ఆయాసపడేవాళ్ళూ;
దుర్బరమైన ఎముకలమీద తమను తాము
నిలదొక్కుకుంటూ, జీవిత బాటమీద నడుస్తున్నట్లు
నడిచే నడుం విరిగిన వృద్ధులూ - ఒక వర్గం.

రెండో వర్గంవారు - కాళ్ళకు రెక్కలున్నట్లు పరిగెత్తుతారు.
కంఠాలు వెండి తీగలైనట్లు పాడతారు.
ఏదో తిరుగులేని మంత్రశక్తిచేత లాగబడుతున్నట్లూ,
పర్వత శిఖరం ఎక్కుతున్నట్లూ వుంటారు.

నా సోదరులారా, ఈ రెండు ఊరేగింపుల్లో మీరు దేంట్లో వున్నా
రాత్రి నిశ్శబ్దంలో ఒంటరిగా వున్నప్పుడు,
మిమ్మల్ని మీరు ఈ ప్రశ్న వేసుకోండి.

నిన్నటి బానిసలతో చేతులు కలుపుతారో,
రేపటి స్వేచ్ఛాపరులతో చేరబోతున్నారో,
మీకు మీరే తేల్చుకోండి.

ఆల్ ముస్తాఫా తిరిగి తన నివాసానికి వెళ్ళి,
గురువచనాలను పఠిస్తూ, దీర్ఘంగా యోచిస్తో
కొన్ని నెలలు ఏకాంతవాసంలో గడిపాడు.
ఆ ఏకాంతవాసంలో, అతడు ఎన్నో సంగతులు నేర్చుకున్నాడు.
తాను నేర్చుకోవలసిన - తెలుసుకోవలసిన సంగతులు
ఇంకా చాలా వున్నాయనీ తెలుసుకున్నాడు.
తనకు తెలియని సంగతులు,
తాను ఎన్నడూ గురువుగారినుంచి వినని విషయాలూ
ఇంకా ఎన్నో వున్నాయనీ గ్రహించాడు.
గురు వచనాలను శ్రద్ధగా చదివి,
వాటిలో ప్రావీణ్యత సంపాదించే వరకు,
అతడు ఆశ్రమందాటి వెళ్ళలేదు.
గురు వచనాలను దేశ ప్రజలకు తెలియ జెప్పాలనుకున్నాడు.
గురు వచన పారాయణలో మనస్సంతనీ కేంద్రీకరించాడు.
తననూ - తన చుట్టూ వున్న సమస్తాన్నీ విస్మరించాడు.
అంతేకాదు, తనను వినడానికి ఓరఫ్ పట్టణ
వీధుల్లో పోగైన వారిని కూడా మరిచాడు.

అతనితో సన్నిహిత సంబంధం వున్నవారు కూడా,
అతని కలుసుకునేందుకు వ్యర్థ ప్రయత్నాలు చేశారు.
తన ఉద్యోగుల ముందు ప్రసంగించేందుకై
మౌంట్ లెబనాన్ గవర్నరు అతన్ని
ప్రార్థనా పూర్వకంగా ఆహ్వానించారు.
ఆ ఆహ్వానాన్ని కూడా తిరస్కరించి,
"దేశ ప్రజలందరికీ ఒక ప్రత్యేక సందేశంతో
త్వరలో అందరి సమక్షానికీ వస్తాను," అని సమాధానం పంపాడు.

ఆల్ ముఖాడా దేశ ప్రజలకు సందేశమిచ్చే సందర్భంలో
దేశ ప్రజలందరూ ఆయన్ని గౌరవ - మర్యాదలతో ఆహ్వానించి,
ప్రతి ఒక్కరూ తమ, తమ నివాసాలకు—
చర్చిలకు - మశీదులకు - యూదులైనవారు తమ
ప్రార్థనా మందిరాలకు - విద్యాసంస్థలకు ఆహ్వానించి
ఆయన బోధించే గురువచనాలను శ్రద్ధగా వినవలసినదిగా
దేశ ప్రజలకు గవర్నరు ఆదేశించారు, ఆజ్ఞాపించారు.

ఆల్ ముఖాడా తన కార్యక్రమాన్ని ప్రారంభించడానికి
ఒకరోజున ఆశ్రమం నుంచి బైటికి వచ్చాడు.
ఆరోజు ప్రజలందరికీ గొప్ప సుదినంగా, ఉత్సవంగా వుంది.
అతడు స్వేచ్ఛగా, నిర్భయంగా, నిరభ్యంతరంగా మాట్లాడాడు.
ప్రేమ - సౌభ్రాతృత్వాల శుభవార్తల్ని బోధించాడు.
ఏ ఒక్కరూ అతన్ని దేశంనుంచిగాని, మతంనుంచిగాని
బహిష్కరిస్తామని భయపెట్ట సాహసించలేదు.
కాని, ఆ విషయాల్నే అతని గురువుగారు బోధించినందుకు
ఆయన్ని దేశనుంచి, మతంనుంచి బహిష్కరించారు.
విధి విధానంవల్ల ఆనాడు ఆయనకు ఆ విధంగా జరిగింది.
అయినా అనేక సంగతుల పర్యవసానాల వల్ల,
గవర్నరుగారు పశ్చాత్తాపడి.
తిరిగి ఆయన్ని వెనక్కి పిలిపించారు.
అటువంటి విధి నిర్ణయం ఆల్ ముఖాడా విషయంలో
ఎట్లా జరక్కుండా వుందో!

లెబనాన్ దేశీయులందరూ అతని బోధలు విన్నారు.
గురు వచనాల్ని కరపత్రాలుగా అచ్చువేసి,

వాటిని ప్రాచీన ఫొయునిషియాలోనూ,
ఇతర అరేబియా దేశాల్లోనూ పంచి పెట్టారు.
కొన్ని కరపత్రాలు, గురువుగారి స్వంత మాటల్లో వున్నాయి.
కొన్నింటిని ఆ గురుశిష్యులు ప్రాచీన గ్రంథాల్లోంచి
ఏరితీశారు.

* * *

# 1

"ఒంటరితనం" అనే మహాసముద్రంలో "జీవితం," ఒక దీవి.
అందున్న రాళ్ళే, ఆశలు. చెట్లే, కలలు. పువ్వులే, ఏకాంతవాసాలు.
దాహంతీరక పరిగెత్తే కోర్కెలే, సెలయేళ్ళు.

నా సహజీవనులారా, మీ జీవితం
మిగిలిన దీవులనుంచి - ప్రదేశాలనుంచి విడిపడ్డ ఒక దీవి.
మీ జీవన తీరాల నుంచి ఎన్నెన్ని ఓడలు,
ఏ ఏ తీరాలకు పయనిస్తున్నాయన్నది పరికించవలసిన
లెఖ్ఖకాదు.
ఎన్నెన్ని యుద్ధనౌకలు మీ తీరాలను తాకుతున్నాయన్నదీ
ముఖ్యమైన సంగతి కాదు.

ఒంటరితనపు వేదనల్ని అనుభవిస్తూ, ఆనందంకోసం ఆకాంక్షిస్తో,
తోటి మానవులకు అపరిచితులుగా,
వారి దయకూ, అవగాహనకూ బహుదూరంగా వుంటూ,
మీరు ఎప్పటికీ ఒంటరిగానే వుండిపోతున్నారు.

ఓ సోదరా, నువ్వు బంగారు మిట్టమీద కూర్చుని,
నీ ఐశ్వర్యానికి నువ్వే అమితానందపడటం,
నీ నిధులకు నువ్వే గర్వపడటం నేను చూశాను.
నువ్వు కూడబెట్టిన ప్రతి బంగారు నాణెం,
నా కోర్కెల్ని - ఆలోచనల్ని, ఇతరుల కోర్కెలతో - ఆలోచ
కలిపే కనుపించని కొక్కెమని నమ్మి
నువ్వు స్థిరంగా వుండటంకూడా నేను చూశాను.

శత్రువుల కోటను ధ్వంసం చేయాలనే ఉద్దేశ్యంతో,
నువ్వు గొప్ప యోధునివలె సైన్యాన్ని నడిపించుకుపోవడం
నేను మనోనేత్రంతో చూశాను.
కాని, నేను మళ్ళా చూసేప్పటికి, నీ బంగారు ఖోషాణం వెను
ఒక హృదయం ఒంటరిగా పడివుంది.
బంగారు పంజరంలో దప్పికగొన్న పక్షి ముందు,
నీరెండిన తాంబాళమే వుంది.

ఓ సోదరా, నువ్వు విజయుడవై, కీర్తి సింహాసనాన్ని అధిష్ఠిం
నీ చుట్టూ నీ ప్రజలు నిలబడి నీ ఘనతను
సంతోషంతో, విజయోత్సాహంతో శ్లాఘించడం,
నీ ఘనకార్యాల్ని కీర్తించడం, నీ వివేకాన్ని అతిగా స్తుతించడ
తాము ప్రవక్త సన్నిధిలో వున్నట్లు, సర్వాతీతమైన సంతో
వారి ఆత్మలు ఆనందంతో ఉప్పొంగుతో
నీ వంక తదేకంగా చూడ్డంకూడా నేను చూశాను.

నీ ఆధీనంలో వున్నవారిని నువ్వు పరికించి,
నువ్వే, వారి ఆత్మలైనట్లుగా నీ ముఖంలో కదలాడే
ఆనంద - అధికార - విజయచిహ్నాల్ని చూశాను.

కాని, నేను మళ్లా చూసేప్పటికి, దేశబహిష్కృతుడు-అదృశ్యహస్తాలను,
ప్రేమనూ, దయనూ అర్థిస్తూ
అన్ని దిక్కులకూ అసహాయంగా చేతులు జాచినా,
రక్షణ కోసం ప్రాధేయపడినా,
ఉపశమనం, మిత్రత్వం మినహా మరేమి లభించనట్లు,
నువ్వు, నీ సింహాసనం పక్కన ఒంటరిగా నిలబడి వున్నావు.

ఓ సోదరా, ఒక అందమైన స్త్రీ నిన్ను మోహింపజేయగా,
ఆమె సౌందర్య పీఠం ముందు నీ హృదయాన్ని
పరచివుంచడం నేను చూశాను.
ఆమె నీ వంక మార్దవంగా - మాతృప్రేమతో చూడ్డంచూసి,
"ఇతని ఒంటరితనాన్ని పోగొట్టి, ఇతని హృదయాన్ని
వేరొక హృదయంతో కలిపిన ప్రేమా,
నువ్వు చిరంజీవివై వర్ధిల్లు," అని నాలో నేను అనుకున్నాను.

నేను మళ్ళా చూసేప్పటికి, ప్రేమ భరితమైన నీ హృదయంలో
మరొక ఏకాంత హృదయం వుంది.
ఒక స్త్రీకి, తన రహస్యాన్ని వ్యక్తపరచాలని ఒక ఒంటరి హృదయం
వ్యర్థంగా విలపించడం నేను చూశాను.
అటూ, ఇటూ కదిలే మేఘంవలె, ప్రేమతో నిండిన నీ హృదయం,
ప్రియురాలి కళ్ళల్లో కన్నీటిధారలుగా మారాలని
వ్యర్థంగా అభిలషిస్తోంది.

ఓ సోదరా నీ జీవితం, ఇతరుల నివాసాలనుంచి
విడిపడ్డ ఒక ఏకాంతవాసం.
పొరుగువాని దృష్టి సోకని ఒంటరి గృహమది.
ఆ గృహం, అంధకారంలో మునక వేస్తే,
పొరుగువారి దీపం దాన్ని కాంతివంతం చేయలేదు.

అది భోజన పదార్థాలు లేని ఇల్లే అయితే,
ఇతరుల గిడ్డంగులేవీ దాన్ని నింపలేవు.
ఆ గృహం ఎడారిలో వుంటే,
శ్రమించి, అందంగా పెంచుకున్న ఇతరుల తోటలోకి
దాన్ని తరలించలేవు.
అది ఒక కొండ శిఖరానవుంటే,
జన సంచారం కల లోయలోకి దాన్ని తీసుకురాలేవు.

ఓ సోదరా, నీ దివ్య జీవనం ఒంటరిదై పోయింది.
అది ఒంటరిదై, ఏకాంతంగా వుండకపోతే,
నువ్వు, నువ్వూ కావు. నేను, నేనూ కాను.
"ఒంటరి తనం - ఏకాంతవాసం" అనేవి లేకపోతే,
నీ కంఠం, నాదిగా; నీ రూపం, నా ప్రతిబింబంగా నమ్మేవాణ్ణి

*　　*　　*

## 2

"దుఃఖం" అనే ఉయ్యాలలో - దురదృష్టం ఒడిలో___
అణగారిపోయిన ఇంట్లో - పుట్టావా?
కన్నీళ్ళలో నానిన ఎండు రొట్టెముక్క తింటున్నావా?
రక్తం, కన్నీరు కలిసిన బురదనీరు తాగుతున్నావా?

దురాశను ధర్మంగా పిలిచే నాయకుల రక్షణార్థం,
మానవ నిర్మితమైన క్రూర చట్టంచేత

పెళ్ళాం - బిడ్డల్ని వదలి, యుద్ధానికి వెళ్ళమని
బలవంతం చేయబడ్డ సిపాయివా, నువ్వు?

సంపూర్ణ జీవితాన్నికాక, దాన్నుండి రాలిన
తునకలతో తృప్తిపడి,
రాసుకోవడానికి కాగితం - సిరా అందుబాటులో వున్నాయనే
సంతోషంతో, కొంతకాలం ఈ భూమిమీద
కొత్తవాడివిగా, సహవాసులకు అపరిచితుడవుగా
వుండే కవివా, నువ్వు?

మనిషికి లంచంఇచ్చి, అతన్ని చెడగొట్టి,
తిరిగి అతన్ని సంస్కరించాలని యత్నించి,
ఒక చిన్న నేరానికి కఠినంగా శిక్షింపబడి,
చీకటి చెరసాలలో బంధిపబడ్డ ఖైదీవా, నువ్వు?

భగవత్ ప్రసాదిత సౌందర్యం కల నిన్ను మోసంచేసి,
నీ హృదయాన్ని చూడగొనలేక, నీ దేహాన్ని కొని,
నిన్ను దుఃఖానికి, కష్టానికి గురిచేసిన ధనవంతుని
నీచమైన కామానికి బలత్కారంగా పట్టుబడ్డ
పడుచుదానివా, నువ్వు?

నువ్వు, వీరిలో ఒకరివైతే - మానవధర్మ సంరక్షణార్థం,
ప్రాణాలు అర్పించిన వాడివి. నువ్వు దౌర్భాగ్యుడివి.

నీ దౌర్భాగ్యం - బలవంతుల అన్యాయ ఫలం—
నిరంకుశుల, అధర్మం - ధనవంతుల, క్రూరత్వం—
కామాతురుల, అత్యాశాపరుల, స్వార్థం.

ఓ నా ప్రియమైన దుర్బలులారా, ఓదార్పు కలిగివుండండి.
వీటన్నింటి వెనుకా, ఒక మహాశక్తి వుంది.
సంపూర్ణమైన దయ - ప్రేమ - న్యాయం - జాలి - కల
ఆ మహత్తరశక్తి, ఈ పదార్థ ప్రపంచానికి అతీతంగా వుంది.

నీడపాటున పెరిగిన పువ్వు మాదిరిగా వున్నారు, మీరు.
మీరు మళ్ళా అందంలో జీవించడానికి, మృదు సమీరం వచ్చి,
మీ విత్తనాల్ని సూర్యకాంతిలోకి మోసుకుపోతుంది.

శీతాకాలపు మంచుకు ఒంగిన మోడుచెట్టు మాదిరిగా
వున్నారు, మీరు.
వసంతం వచ్చి, తన పచ్చని పట్టుబట్టను మీపై పరుస్తుంది.
మీ నవ్వుల్ని దాచిన కన్నీళ్ళ ముసుగును,
"సత్యం" చింపి, పారేస్తుంది.
బాధలు పడే ఓ నా సోదరులారా,
మిమ్మల్ని నా దగ్గరకు తీసుకుంటాను.
నేను మిమ్మల్ని ప్రేమిస్తాను.
మిమ్మల్ని హింసించే వాటిని, తృణీకరిస్తాను.

# 3

జీవితం, మనల్ని - ఒక స్థితినుంచి, మరో స్థితికి లాక్కొని పోతుంది.
విధి, మనల్ని ఒక కొననుంచి, మరోకొనకు ఈడ్చుకుపోతుంది.
మనం ఆ రెండింటిమధ్య తగుల్కొని, భీకర గర్జనల్ని వింటాం.
మన గమనానికి ఆటంకంగా, అవరోధంగా నిలిచినదానినే చూస్తాం.

శోభాయమానమైన సింహాసనాన్ని అధిష్టించినట్లు, సౌందర్యం
తనకుతానై వచ్చి, తన సంగతి మనకు వ్యక్త పరచుకుంటుంది.
కాని, మనం ఆ సౌందర్యాన్ని వాంఛతో సమీపిస్తాం.
దాని పవిత్ర కిరీటాన్ని కిందికిలాగి,
మన పాప కర్మలతో దాని పట్టుబట్టల్ని అపవిత్రం చేస్తాం.

వినయ - విధేయతలు వస్త్రాలుగా ధరించి,
ప్రేమ, మన ముందునుంచి వెళ్ళిపోతుంది.
కాని, మనం ఆ ప్రేమ నుంచి భయంతో పారిపోతాం.
లేదా, చీకట్లో దాక్కుంటాం. కాకపోతే,
ప్రేమ పేరు మీదుగా. చెడు చేయడానికి ఆ ప్రేమనే వెంబడిస్తాం.

గొప్ప వివేకవంతుడు సైతం, అత్యధిక ప్రేమ భారం ముందు
వంగిపోతాడు. కాని, నిజం చెప్పాలంటే, ఆ ప్రేమ
గంతులువేసే లెబనాన్ దేశపు మలయమారుతమంత
తేలికగా వుంటుంది.

రుచైన భోజనం, పసందైన ద్రాక్ష సారాయి కల బల్ల దగ్గర
తన సహపంక్తిని కూర్చోమని స్వేచ్ఛ మనని ఆహ్వానిస్తుంది.
కాని, మనం ఎప్పుడైనా ఆ పంక్తిలో కూర్చుంటే,
అతిగా తిని, భుక్తాయాసపడతాం.

ఆహ్వాన హస్తాలతో ప్రకృతి మన వద్దకు బాహాటంగా వచ్చి,
తన సౌందర్యాన్ని అనుభవించమని మనల్ని కోరుతుంది.
కాని, మనం దాని నిశ్శబ్దానికి భయపడి,
క్రూర మృగమైన తోడేలు నుంచి తప్పించుకుని పరిగెత్తే,
గొర్రెలాగ, జన సమ్మర్థమైన పట్టణాల్లోకి
అతివేగంగా పారిపోయి, ఆ గుంపుల్లో కలిసిపోతాం.

పసిబిడ్డల అమాయకపు చిరునవ్వుతోనూ,
ప్రేమికుల తియ్యని ముద్దులతోనూ ఆకర్షిస్తూ,
"సత్యం" మనల్ని ఆహ్వానిస్తుంది.
కాని, మనం దాని ముఖంమీదే దయాద్వారాన్ని మూసి,
దాన్ని శత్రువుగా భావిస్తాం.

మానవ హృదయం సహాయంకోసం బిగ్గరగా అరుస్తుంది.
ఆత్మ, విముక్తికోసం మనల్ని అర్థిస్తుంది.
కాని, మనం వాటి ఆర్తనాదాల్ని లక్ష్యపెట్టం.
అసలు మనం దేన్నీ సహజంగా వినం, అవగాహన
చేసుకోం. కాని, ఎవరైనా వాటిని విని, అవగాహన
చేసుకుంటే, మనం వారిని పిచ్చివారంటాం. లేదా,
వారినుంచి పారిపోతాం.

ఆ విధంగా రాత్రులు గడచిపోతున్నాయి.
మనం అజ్ఞానంలో బ్రతుకుతున్నాం.

కాలం, మనకు అభివందనంచేసి,
ఆలింగనం చేసుకుంటోంది. కాని, మనం
నిరంతరం భయంతోనే బ్రతుకుతున్నాం.

ప్రభువు హృదయ కవాటం పూర్తిగా తెరచివున్నా,
మనం భూమికి అతుక్కునే వున్నాం.
ఆకలి మన హృదయాల మీద పడి కొరుక్కుతింటున్నా,
జీవితమనే రొట్టెముక్కమీద ఎక్కి తొక్కుతున్నాం.
మనిషికి జీవితం ఎంత గొప్పది!
అయినా మనిషి, ఆ జీవితం నుంచి
ఎంత దూరంగా తొలగి వుంటున్నాడో!

* * *

# 4

జీవిత వ్యామోహానికి, జ్ఞానోదయానికి మధ్య నున్న
వ్యత్యాసాన్ని చూడ్డమే, మొదటి క్షణం.
అదే, హృదయాంతర సీమల్ని వెలిగించే మొదటి జ్వాల.
అదే, హృదయమనే వెండి తీగమీద మీటిన
మొదటి ఇంద్రజాలపు స్వరం.

ఆ క్షణం - కాలచక్ర గమనాన్ని, అజ్ఞానాంధకారపు కృత్యాల్ని
అంతరాత్మ కార్యాల్ని ఆత్మముందు విప్పి చూపుతుంది.

భవిష్యత్కాల శాశ్వతత్వపు రహస్యాల్ని వల్లిస్తుంది.
ప్రేమ దేవత, "ఇష్టార్" చేత విసరబడ్డ విత్తనమే,
ఆ మొదటి చూపు.
ఆ విత్తనం, ప్రియుని నయనాలతో ప్రేమ క్షేత్రంలో
నాటబడుతుంది.
"దయ" దాన్ని పెంచితే, ఆత్మ, ఆ పంటను అనుభవిస్తుంది.

ప్రియుని కళ్ళ నుంచి వెలువడ్డ మొదటి చూపు—
నీటి ఉపరితలాన తేలియాడే, దివ్యాత్మలాగునవుంది.
"అది అలా వుండుగాక!" అని ప్రభువు అన్నప్పుడు,
అది స్వర్గానికి - భూమికీ జన్మనిచ్చింది.

* * *

జీవన మధువుతో నింపిన మధు పాత్రనుంచి
ప్రేమ దేవత మొదటిసారిగా రుచి చూడ్డమే,
మొదటి ముద్దు.

ఆత్మను మోసపుచ్చి, హృదయాన్ని దుఃఖపెట్టే
సంశయానికీ,
అంతరాత్మను ఆనందంతో ముంచెత్తించే నిశ్చయానికి
మధ్య విభజన రేఖే, ప్రథమ చుంబనం.

జీవన రంగానికి, ఆ ముద్దే ఆరంభం.
ఆదర్శ మానవుని జీవిత నాటకానికి నాంది గీతమే
మొదటి ముద్దు.

గతంలోని వింతలను, భవిష్యత్కాల కాంతులతో
కలిపే బంధమే, తొలి ముద్దు.

భావాల నిశ్శబ్దానికీ, వాటి పాటకూ మధ్య కొక్కెమే,
ప్రథమ చుంబనం.
"హృదయం, సింహాసనం" అని, "ప్రేమ" "చక్రవర్తి" అని
"భక్తి" కిరీటం అని నాలుగు పెదవులు కలిసి
ఉచ్చరిస్తో ప్రకటించిన మొదటి మాటే, మొదటి ముద్దు.
ఉపశమనపు దీర్ఘ నిట్టూర్పూ, మధురమైన మూలుగూ
విడుస్తూ - గాలి, గులాబి పువ్వుల మీద మృదువైన వేళ్ళతో
నాజూకుగా నొక్కడమే, ప్రథమ చుంబనం.

కలల లోకంలోకీ, మరో ప్రపంచంలోకీ
ప్రియులను మోసుకుపోయే ఇంద్రజాలపు
ప్రకంప నారంభమే, మొదటి ముద్దు.
మూడవ ఆత్మ ఆవిర్భవించేందుకు,
రెండు పువ్వుల పరిమళ సంయోగమే, ప్రథమ చుంబనం.

మానవ హృదయ క్షేత్రంలో, ప్రేమదేవత చల్లిన విత్తనం వలె,
ప్రథమ దర్శనం పున్నట్లే,
జీవన వృక్షాగ్రాన పూసిన ప్రథమ పుష్పంవలె,
వుంటుంది, మొదటి ముద్దు.

* * *

పగలు పాడటంకోసం రాత్రి స్వరపరచుకున్న
సంగీత స్వరాలలోకి జీవన వచన కావ్యాన్ని
కీర్తనలుగా - పాటలుగా - స్తుతి గీతాలుగా
కూర్చుకుంటుంది, ప్రేమ.

ఆ ప్రేమ, తన వాంఛా ముసుగును తొలగించి,
హృదయ కుహర మధ్య స్థానాన్ని వెలిగించి,

ఆనందాన్ని అందిస్తుంది. ఆ ఆనందాన్ని—
ఆత్మ, పరమాత్మను ఆలింగనం చేసుకున్నప్పుడు పొందే
దివ్యానందం తప్ప, మరే ఆనందం అధిగమించలేదు.

భూమిమీద మూడవ జీవి ఆర్భవించేందుకు,
రెండు జీవుల సంయోగమే, వివాహం.
భిన్నత్వాన్ని తొలగించాలనే గాఢమైన ప్రేమలో,
రెండు జీవులు ఏకంకావడమే, వివాహం.
రెండు జీవుల ఏకత్వాన్ని కరిగించి కలిపే,
ఉన్నతమైన సంయోగమే, వివాహం.

ఆరంభం వీక్షణంగా, అంతం శాశ్వతంగా వున్న
గొలుసులోని బంగారు కొక్కెమే, వివాహం.
దివ్యమైన ప్రకృతి క్షేత్రాన్ని ఫలవంతం చేయడానికే,
ఆశీర్వదించడానికే నిష్కళంకమైన ఆకాశం నుంచి
పడిన అమృతపు జల్లే, వివాహం.

ప్రియతముని కళ్ళనుంచి వెలువడిన ప్రథమ వీక్షణం,
మానవ హృదయ క్షేత్రంలో విత్తనం వలె—
ప్రియురాలి పెదవుల ప్రథమ చుంబనం,
జీవన వృక్షాగ్రాన పూసిన ప్రథమ పుష్పం వలె—
ఆ విత్తనం యొక్క ప్రథమ పుష్పానికి పండిన,
ప్రథమ ఫలంవలె వుంది,
వివాహంతో కలిగిన సంయోగం.

* * *

# 5

వసంతం వచ్చింది.
సెలయేరుల, చిరు ప్రవాహాల గల గలల్లో,
పువ్వుల నవ్వుల్లో ప్రకృతి మాట్లాడ నారంభించింది.
మానవుని ఆత్మ, ఆనందంతో తృప్తిగా వుంది.

అంతలోనే అకస్మాత్తుగా ప్రకృతికి ఆగ్రహం వచ్చింది.
అందమైన నగరాన్ని నాశనం చేసింది.
ప్రకృతిదయనూ, మాధుర్యాన్ని, చిరునవ్వునీ,
క్షణంలో మరిచాడు మానవుడు.

శతాబ్దాల తరబడి నిర్మించుకున్న అందమైన నగరాన్ని
భయంకరమైన బుద్ధిశక్తి ఒక్క గంటలో
సర్వనాశం చేసింది.
భీకరమైన మృత్యువు, మానవుల్ని, జంతువుల్ని,
తక్కిన జీవరాసుల్ని తన వాడి గోళ్ళలో
నిర్దయగా చీల్చి, అణగద్రొక్కింది.

తీవ్రమైన మంటలు, మనిషినీ, అతని వస్తు సముదాయాల్ని
అతని వసతుల్ని సర్వనాశనం చేశాయి.
జీవన సౌందర్యాన్ని బూడిదకింద దాచేసింది,
కాళరాత్రి.

భూగర్భం నుంచీ బీభత్సంగా సర్వనాశనం చేసే
పిడుగువంటి వినాశనం మధ్యా, సమస్త దుఃఖాల మధ్యా
శిథిలమై పోయిన అన్నింటి మధ్యా ఆత్మ నిలబడి,
వాటిని తదేకంగా చూస్తో
మానవుని బలహీనత గురించీ, సర్వశక్తి సంపన్నుడైన
ఈశ్వరుని గురించీ విచారంతో యోచించింది.

భూమి పొరల అడుగున - చాలా లోతున,
ఆకాశపు అణువుల మధ్య దాగివున్న
మానవుని శత్రువు గురించి, దీర్ఘంగా యోచించింది.
మాతృ గర్భశోకాన్ని, శిశుక్షుధాక్రందనాన్ని విని,
వారి బాధల్ని పంచుకుంది.
మూలశక్తుల పశుత్వం మీదా, మానవుల అల్పత్వం మీదా
యోచించింది.

నిన్న మానవసంతతి తమ తమ నివాసాల్లో
ఏ విధంగా సుఖంగా నిద్రించిందీ జ్ఞప్తికి తెచ్చుకున్నది.
కాని, ఈనాడు ఆ మానవులంతా దిక్కులేని
కాందిశీకులైనారు.
ఒకనాడు అందమైన తమ పట్టణాన్ని
దూరం నుంచి చూస్తున్నట్లు చూసి, దుఃఖిస్తున్నారు.
వారి ఆశ, నిరాశగా - వారి ఆనందం, దుఃఖంగా—
వారి శాంతి జీవనం, సంఘర్షణామయంగా
మారిపోయింది క్షణ కాలంలో.
దుఃఖం, బాధ, నిరాశలనే ఇనుప గోళ్ళలో చిక్కుకున్న
శిథిల హృదయాలతో కలసి, ఆత్మ బాధ పడింది.

మూల శక్తులన్నింటినీ బంధించిన విధి నిర్ణయాన్ని
సందేహిస్తో - సంశయిస్తో - యోచిస్తో - బాధపడుతో
నిశ్శబ్దంగా, నెమ్మదిగా ఇట్లా అంది ఆత్మ:

అతి తీవ్రమైన ఆగ్రహానికి, వినాశనానికి
కారణభూతమైన దివ్యజ్ఞానం——
ఈ సృష్టికంతకూ అతీతంగా వుంది. కాని,
ఆ జ్ఞానమే ఊహాతీతమైన సౌందర్యాన్ని ఉద్భవింపజేస్తుంది.

ద్వేషం - అసూయ - చెడు మానవ హృదయాన్ని
కలచి వేసినట్లు, అగ్ని - పిడుగు - తుఫాను
భూమిని బాధిస్తాయి.
బాధా తప్త దేశం ఆక్రోశిస్తూవుంటే, కాల నాటక రంగం మీద
అభినయించిన హెచ్చరికలు - ఆపదలు - విషాదాలు
జ్ఞప్తికి వచ్చాయి.

చరిత్ర పొడవునా, మానవుడు భూమి నాలుగు చెరగులా
గోపురాల్ని - భవనాల్ని - పట్టణాల్ని - ఆలయాల్ని
నిర్మించడం నేను ఎరుగుదును.
కోపావేశంతో తెరగబడ్డ భూమి, వాటి నన్నింటినీ
ఒక్కసారిగా తనలోకి లాక్కునిపోవడం కూడా
నేను ఎరుగుదును.

ముట్టడించి కూడా జయింప శక్యంకాని కోటల్ని,
బలవంతుడు నిర్మించడం నేను ఎరుగుదును.
కళాకారులు తమ ఇంటి గోడల్ని చిత్రాలతో
అలకరించడం గమనించాను.

నేర్పరులు – మేధావులు తేజోవంతమైన
తమ మనోశక్తితో నిర్మించిన వాటి నన్నింటినీ
భూమి కబళించి, మింగడం కూడా నేను చూశాను.

తన సౌందర్యాన్ని గొప్పగా ప్రకటించుకునేందుకు,
మానవ నిర్మిత ఆభరణ, అలంకారాల అవసరం లేక,
తన పొలాల పచ్చదనంతో, సముద్రతీరాల
బంగారువన్నె ఇసుక దిబ్బలతో
పెళ్ళికూతురులాగ భూమి అందంగా వుండటం
నేను ఎరుగుదును.

కాని, ప్రకృతి కోపం - వినాశనం - బీభత్సం మధ్య
మానవుడు తన దైవత్వంలో బ్రహ్మాండమైన
ఆకారంతో నిలబడి, భూమి కోపావేశాన్ని,
మూల శక్తుల ఉగ్రతనూ ఎగతాళి చేయడం
నేను ఎరుగుదును.

బాబిలాన్ - నినెవ్ - పామిరా - పాంపే శిధిలాల మధ్య,
మానవుడు దీప స్తంభంలాగ నిలబడి అమర గానం చేశాడు:

నేను మానవుణ్ణి.
అంతం లేనివాణ్ణి.
తనదైన దాన్ని,
భూమిని తీసుకోనీ.

* * *

# 6

ఈశ్వరుడు నీకు వివేకం కన్నా గొప్ప ఉపదేశకుని,
బలమైన ఆయుధాన్ని ఇవ్వలేడు కనుక, నువ్వు
వివేకం చెప్పే మాటలు శ్రద్ధగా విని, మంచిగా
ఉపయోగించుకుంటే, నువ్వు ఆయుధపాణివై రక్షింపబడతావు.

వివేకం మన యెడల తెలివిగల మంత్రిగా,
విశ్వసించదగిన మార్గ దర్శకుడుగా, బుద్ధి సూక్ష్మతగల
సలహాదారుడుగా వ్యవహరిస్తుంది.

వివేకం నీ అంతరాత్మతో సంభాషిస్తోందంటే,
నువ్వు వాంఛా విముఖుడవు అనడానికి నిదర్శనం.
జ్ఞాన దీప్తిలో కోపం అంధకారం వలె వున్నట్లు;
అజ్ఞానాంధకారంలో, వివేకం తేజస్సుగా వెలుగుతుంది.
వివేకంతో మసలుకో.
ప్రేరణగాక, వివేకం నీ ఉపదేశకునిగా వుండనియ్యి.

వివేకం నీ పక్కన వున్నా, జ్ఞానంతో తోడ్పాటులేకపోతే,
అది నిస్సహాయురాలని జ్ఞాపకముంచుకో!
తన ఏకోదరైన జ్ఞానం తోడులేని వివేకం,
ఇల్లులేని దరిద్రం వలె వుంటుంది.
వివేకంలేని జ్ఞానం, సంరక్షణలేని గృహం వలె వుంటుంది.
వివేకం తోడ్పాటు లేకపోతే,
ప్రేమ - న్యాయం - ధర్మం - మంచితనం - ఇవన్నీ నిరుపయోగం.

వివేక విహీనుడైన పండితుడు,
ఆయుధంలేకుండా యుద్ధానికి వెళ్ళే సిపాయి వంటివాడు.
వివేక రహితుడు ఆగ్రహంతో
జాతి పవిత్ర జీవన ప్రవాహాన్ని విషపూరితం చేస్తాడు.
నిర్మలమైన నీళ్ళకుండలో అతడు కుంకుడు కాయవలె వుంటాడు.

వివేకం - పాండిత్యం రెండూ, ఆత్మ - దేహం వలె వుంటాయి.
దేహంలేని ఆత్మ, ఉత్తగాలి.
ఆత్మలేని దేహం, అర్థంలేని చట్రం.

విద్యారహిత వివేకం, దున్నని నేల వలె,
పోషణలేని మానవ దేహం వలె వుంటుంది.

వివేకం, అంగడి వీధుల్లో అమ్మబడే సరుకుకాదు.
వివేకం విరివిగా వుంటే, ధర తక్కువగా వుంటుంది.
వివేకం, అంగడిలో దొరికితే, తెలివైనవాడు ఒక్కడే
దాని నిజమైన విలువ తెలుసుకుంటాడు.

పిచ్చివాడు, పిచ్చితనాన్నే చూసినట్లు,
అవివేకి, అవివేకాన్ని తప్ప మరి దేనినీ చూడలేడు.
నిన్న నేను ఒకతన్ని అడిగాను, "మాలోని అవివేకుల్ని లెఖ్ఖపెట్టు,
అని. దాని కతడు నవ్వి, "లెఖ్ఖపెట్టాలంటే చాలా కష్టం.
ఎంతో కాలం పడుతుంది. అంతకన్నా
వివేకవంతుల్ని లెక్కపెట్టడం సులభమేమో!" అన్నాడు.

నీ విలువ ఏమిటో నువ్వు తెలుసుకుంటే, నువ్వు చెడిపోవు.
వివేకం, నీ కాంతి. అది, నీ సత్యం యొక్క దీప స్తంభం.
జీవన మూలా ధారామే, వివేకం.

ఈశ్వరుడు నీకు జ్ఞానమిచ్చాడు. ఆ జ్ఞాన కాంతిలో నువ్వు
ఈశ్వరుణ్ణే ఆరాధించడం కాదు, దాని సహాయంతో
నీలోని బలహీనాన్ని, దృఢత్వాన్ని, నీకు నువ్వే చూసి తెలుసుకో!

నీ కంటిలోని నలుసును నువ్వు చూసుకోకపోతే,
నీ పొరుగువాని కంటిలోని నలుసును నువ్వు చూడలేవు.

ప్రతిరోజూ నీ అంతరాత్మలోకి చూసుకుని
నీ తప్పుల్ని సరిదిద్దుకో. నువ్వు, ఆ ధర్మాన్ని పాటించకపోతే,
నీలోని జ్ఞానానికి, వివేకానికి అబద్ధీకుడవు అవుతావు.

కోర్కెల్ని అదుపులో పెట్టడం, అంతరాత్మ ఆజ్ఞల్ని మన్నించడం
నువ్వు మొదట నేర్చుకోకపోతే,
నిన్ను నువ్వు ఎట్లా నడుపుకోవాలో తెలుసుకోలేవు కనుక,
నీకు నువ్వే శత్రువైనట్లు,
నీ మీద నువ్వే ఒక కన్నువేసి వుంచుకో!

అవివేకానికి తప్ప, ప్రతి పాపానికి పరిహారం వుంది.
మూర్ఖపు పట్టుదల కల బుద్ధిహీనుణ్ణి చివాట్లు వేయడం,
మందబుద్ధికి బోధించడం
రెండూ నీటిమీద రాతలు వంటివి.
గుడ్డివానిని — కుంటి వానిని — కుష్టు వానినీ
పక్షవాతపు రోగిని ఏసు ప్రభువు బాగుచేశారు కాని,
అవివేకిని మాత్రం బాగుచేయలేక పోయారు.

సమస్యను బహు ముఖంగా పరిశీలిస్తే,
తప్పు ఎక్కడ జారుకుందో తెలుస్తుంది.

ఇంటి సింహద్వారం పెద్దది చేసేటప్పుడు,
పెరటి వాకిలి బాగా ఇరుకుగా వుండకుండా చూడు.

"అవకాశం పక్కనుంచి తొలగిపోయిన తర్వాత,
ధాన్ని చేపట్టాలని చూసేవాడు, అది సమీపించడం చూస్తాడు
కాన్ని, దాన్ని చేజిక్కించుకునే యత్నం చేయడు," అని
ఒక పండితుడు చెప్పగా విన్నాను.

ఈశ్వరుడు అపకారం చేయడు. "తప్పు – నాశనం" అనే
గోతుల్లో మనం పడిపోకుండా మనని మనం కాపాడుకోవడం
కోసం, ఈశ్వరుడు మనకు వివేకాన్ని – విద్యను ప్రసాదిం

ఈశ్వరుడు ఎవరికి వివేకాన్ని కానుకగా ప్రసాదిస్తాడో,
వారు ధన్యులు.

* * *

# 7

నా హృదయంలో ప్రేమించిన ఆమె పక్కన కూర్చుని
ఆమె చెప్పే మాటలు వింటూ వుంటే, ఈ చిదాకాశంలో
"విశ్వం" ఒక కలలాగ "దేహం" ఇరుకైన ఖైదులాగ తో
అందు నా ఆత్మ తిరగ నారంభించింది.

నా ప్రియురాలి అతి మనోహరమైన కంఠస్వరం
నా హృదయాన్ని తాకింది.

ఓ నా మిత్రులారా, ఆమె కంఠ స్వరమే, సంగీతం.
నేను ప్రేమించిన ఆమె నిట్టూర్పుల ద్వారా,

ఆమె పెదవుల మధ్య అర్థోచ్ఛారణలో వెలువడిన
మాటల ద్వారా, నేను ఆమెను విన్నాను.
అదే సంగీతం.

నా శ్రవణేంద్రియపు నయనాలతో,
నా ప్రియురాలి హృదయాన్ని దర్శించాను.

మిత్రులారా, ఆత్మల భాషే, సంగీతం.
ఆ సంగీత మాధుర్యం,
వీణతీగల్ని ప్రేమతో ప్రకంపింపజేసే మందమారుతం వలె
వుంటుంది.
తన మృదువైన వేళ్ళతో మన భావాల ద్వారాన్ని
ఆ సంగీతం తట్టినప్పుడు, చిరకాలం క్రిందట—
గతంలోతుల్లో మరుగుపడివున్న స్మృతులు, మేల్కొంటాయి.
విషాదమైన స్వరాలు, విచారకరమైన జ్ఞాపకాల్ని,
శాంతయుతమైన స్వరాలు, సంతోషకరమైన స్మృతుల్ని
గుర్తు చేస్తాయి.
ప్రేమికుల ఎడబాటప్పుడు, ఆ తీగల శబ్దం కన్నీరు తెప్పిస్తుంది.
ఈశ్వరానుగ్రహం వల్ల మనం శాంతంగా వున్నప్పుడు,
ఆ తీగల శబ్దమే, చిరునవ్వు పుట్టిస్తుంది.

సంగీతం యొక్క ఆత్మ, విశ్వాత్మది. దాని మనసు,
విశ్వహృదయానిది.

ఈశ్వరుడు మానవుణ్ణి సృష్టించి,
అతనికి అన్ని భాషలకు భిన్నమైన భాషగా
సంగీతాన్ని ప్రసాదించాడు. ఆ సంగీత ప్రభావాన్ని
ఆది మానవుడు అరణ్యాల్లో ఆలాపించాడు.

ఆ సంగీతం, రాజుల హృదయాల్ని ఆకర్షించి, వారిని
సింహాసనాల మీద నుంచి కదిలించింది.

విధి పవనాల కరుణలో, మన ఆత్మలు,
సుకుమార కుసుమాలుగా వున్నాయి.
ఉదయ సమీరంలో ఆ పువ్వులు వణకుతాయి.
స్వర్గం నుంచి జారిపడ్డ మంచు బిందువుల కింద,
ఆ కుసుమాలు తమ తలలు వంచుతాయి.

పక్షి పాటపాడి, మనిషిని నిద్రలేపి,
శాశ్వత జ్ఞానం సృష్టించిన విజయగీతాలాపనలో
తనతోపాటు కంఠం కలపమని అతన్ని ఆహ్వానిస్తుంది.

ప్రాచీన గ్రంథాల్లో ఇమిడివున్న, అద్భుతాల అర్థాన్ని
అడిగి తెలుసుకునేటట్లు, ఆ సంగీతం మనల్ని ప్రేరేపిస్తుంది.

పక్షులు పాటపాడి, పొలాల్లో పువ్వుల్ని పిలుస్తాయా?
చెట్లతో సంభాషిస్తాయా? సెలయేళ్ళ గుసగుసల్ని
ప్రతిధ్వనింపజేస్తాయా? ఎందుకంటే,
పక్షి ఏం చెపుతోందో — సెలయేరు ఏం పాడుతోందో —

కెరటాలు నెమ్మదిగా, మృదువుగా తీరాన్ని తాకేప్పుడు
ఏ రహస్యాల్ని వెల్లడిస్తాయో —
మానవుడు ఎన్నటికీ తన జ్ఞానంతో తెలుసుకోలేడు.

చెట్ల ఆకులమీద వర్షం పడ్డప్పుడూ,
కిటికీ అద్దం మీద వర్షపు చినుకు నెమ్మదిగా కొట్టినప్పుడు,
అవి ఏం చెపుతూన్నాయో మానవుడు
తన అవగాహనతో తెలుసుకోలేడు.

పొలాల్లోని పువ్వులతో గాలి ఏం చెబుతుందో కూడా
అతడు తెలుసుకోలేదు.

కాని, తన మనోభావాల మీద స్ఫురించే శబ్దార్థాన్ని
మానవ హృదయం గ్రహించగలదు.
శాశ్వత జ్ఞానం, తరచు నిగూఢమైన భాషలో
మానవునితో మాట్లాడుతుంది.
మానవుడు మౌనంగా వున్నప్పుడూ,
నిశ్చేష్టుడై నిలబడిపోయినప్పుడూ
ప్రకృతి - ఆత్మ కలసి సంభాషించుకుంటాయి.

వాటి మాటలకు మానవుడు రోదించలేదా?
అతని కన్నీళ్ళు వాగ్ధాటి కల జ్ఞానం కాదా?

అమరగానమా,
ప్రేమాత్మజా, నువ్వు—
దుఃఖానికి - ప్రేమకూ మూలం.
మానవ హృదయ స్వప్నం.
దుఃఖ ఫలం.
ఆనంద కుసుమం,
అనుభవ పరిమళం.
భావవికసితం.
ప్రియుల వాణివి.
రహస్యాల్ని బహిరంగ పరచేదానివి.

దాగిన ప్రేమ కన్నీళ్ళకు, మాతృమూర్తివి.
కవుల - వాగ్గేయకారుల - శిల్పుల ప్రేరణశక్తివి.
పద భాగాలలో, ఆలోచనల ఐక్యం, నువ్వు.

సౌందర్యం నుంచి ప్రేమను రూపొందించేది, సంగీతం.
కలల ప్రపంచంలో, హృదయాన్ని విజయోత్సాహంతో
ఉప్పొంగించే ద్రాక్ష సారాయి వంటిది, సంగీతం—

యోధులకు ధైర్యమిచ్చేది.
ఆత్మకు శక్తినిచ్చేది.
కరుణాసుధాబ్ధి.
సుకుమార సాగరం.

ఓ సంగీతమా!
నీ అగాధాల్లో మా హృదయాల్ని - ఆత్మల్ని
భద్రపరచుకున్నాం.
చెవులతో చూడ్డం, హృదయంతో వినడం
మాకు నువ్వే నేర్పావు.

*           *           *

# 8

ఈశ్వరుని ప్రేమించి, భక్తితో సేవించేవాడే, జ్ఞాని.
మానవుని యోగ్యత, అతని జ్ఞానంలో - అతను చేసే పనుల్లో
వుంటుందేకాని, అతని ఒంటి రంగులో, నమ్మకంలో,
జాతిలో, మతంలో, వంశంలో వుండదు.

ఓ, నా, మిత్రమా! "అజ్ఞాని రాజ్యానికి వారసుడు కావడం
జ్ఞానవంతుడైన పశువుల కాపరి, దేశానికి

ఎంతో విలువైనవాడు;" అన్న సంగతి జ్ఞాపకముంచుకో.
నీ తండ్రి ఎవరైనా, నీది ఏ జాతైనా లెఖ్కలేదు..
నిజమైన ఔదార్యపు స్పష్టతే, జ్ఞానం.

విద్య ఒక్కటే నిరంకుశ ప్రభువులు దోచుకోలేని ఐశ్వర్యం
నీలోని జ్ఞానజ్యోతిని మృత్యువు ఒక్కటే కాంతిహీనం
చేయగలదు.
దేశం యొక్క నిజమైన సంపద విద్యలో - విజ్ఞానంలో
దాని పుత్రుల నీతి వర్తనలో వుంటుందేకాని,
వెండి - బంగారాల్లో వుండదు.

ఆత్మ ఔదార్యం, మనిషి ముఖాన్ని సౌందర్యవంతం చేసి,
దయా - గౌరవాల ఉత్పత్తికి కారణభూత మౌతుంది.
ప్రతి ఒక్కరి కళ్ళల్లోనూ - ముఖా కృతిలోనూ—
శారీరక కదలికల్లోనూ - సౌంజ్ఞలలోనూ
ప్రత్యక్షంగా గోచరిస్తుంది, ఆత్మ.
మన రూపం - మన మాట - మన పనులూ
ఎప్పుడూ మనకంటె గొప్పవి కావు.
ఆత్మ, మన గృహం. కళ్ళు, కిటికీలు. మాటలు, దూతలు.

జ్ఞానం, అవగాహన రెండూ జీవితానికి
విశ్వాసపాత్రులైన స్నేహితులు.
అవి అసత్యమైనవిగా నీకు ఎప్పుడూ రుజువుకావు.
జ్ఞానం, నీ కిరీటం. అవగాహన, అధికార చిహ్నమైన
నీ దండం.
జ్ఞానం - అవగాహన నీలో, వున్నంత కాలం
నువ్వు ఇంక ఏ గొప్ప నిధుల్ని కలిగి వుండనక్కరలేదు.

నిన్ను అర్థం చేసుకున్నవాడు,
నీ సోదరుని కన్నా గొప్ప బంధువు.
నీ బంధువు, నిన్ను అర్థం చేసుకోకపోవచ్చు.
నీ నిజమైన విలువ తెలుసుకోలేకపోవచ్చు.

అజ్ఞానితో మిత్రత్వం,
తాగుబోతుతో తర్కించడమంత అవివేకం.

ఈశ్వరుడు నీకు తెలివినీ, జ్ఞానాన్నీ ఇచ్చాడు.
ఈశ్వర కృపాదీపాన్ని ఆర్పేయకు.
"కామం - పొరపాటు" అనే చీకట్లో, జ్ఞానకాంతిని
దిగజారిపోనీయకు.
మానవజాతి మార్గాన్ని తన కాగడాతో కాంతివంతం
చేయడానికి, వివేకవంతుడైన మానవ పుత్రుడు వస్తున్నాడు.

పది లక్షల అంధ విశ్వాసుల కన్నా, ఒక న్యాయస్థుడు,
పిశాచానికి ఎంతో బాధ కలిగిస్తాడనేది జ్ఞాపకముంచుకో.

పనికిమాలిన ఎంతో శాస్త్ర జ్ఞానం కన్నా,
ప్రజ్వరిల్లే కొంచెం జ్ఞానమైనా, అపరిమితమైన విలువైనది.

నీ వస్తువుల విలువ నీకు జ్ఞానం బోధించకపోతే,
విషయవాసనల నుంచి నీ జ్ఞానం నిన్ను విముక్తి పరచకపోతే,
నువ్వు ఎప్పటికీ సత్యసింహాసనాన్ని సమీపించలేవు.

మానవుల దుఃఖాలకు, బలహీనాలకూ
అతీతంగా వుండేటట్లు నీ జ్ఞానం నీకు బోధించకపోయినా,
నీతోటి వారిని సరైన మార్గాన నడపడానికి నీ జ్ఞానం
నీకు సహాయపడకపోయినా

నువ్వు నిశ్చయంగా విలువలేని వాడివి.
న్యాయ నిర్ణయం జరిగే వరకు, నువ్వు అలాగే పడి వుంటావు.

వివేకవంతులు చెప్పే జ్ఞాన వాక్యాలు విని,
వాటిని అర్థం చేసుకుని, నిత్య జీవితంలో ఆచరించు,
వాటితోనే జీవించు. కాని, వాటిని అప్పగిస్తున్నట్లు
కనపడకు.
అర్థం కాని దాన్ని పదే పదే పలికేవాడు,
పుస్తకాల బరువుమోసే గాడిదకన్నా ఏమీ గొప్పవాడు కాదు.

* * *

# 9

ఓ - నా దుర్బల మిత్రమా, నిన్ను దుర్దశలో వుంచే దారిద్ర్యమే
"ధర్మబద్ధమైన జ్ఞానాన్ని - జీవిత అవగాహనను"
వ్యక్త పరుస్తుందని నువ్వు తెలుసుకుంటే;
నీకు వున్న దానితో నువ్వు తృప్తి పడతావు.

"ధర్మ బద్ధమైన జ్ఞానం," అని నేను ఎందుకు అంటున్నానంటే,
జ్ఞానాన్ని సంపాదించడానికి ధనవంతుడు
ఐశ్వర్యాన్ని కూడబెట్టే కార్యంలో నిమగ్నుడై వుంటాడు.
"జీవిత అవగాహన" అని నేను ఎందుకు చెపుతున్నానంటే,
సరైన సత్య మార్గాన్ని నిలిపేందుకు, బలవంతుడు
అధికారాన్ని - విజయాన్ని సాధించే యత్నంలో
చాలా ఆరాట పడుతూవుంటాడు.

ఓ, నా దుర్బల మిత్రమా, ఆనందించు.
నువ్వే న్యాయ వాక్కువి. నువ్వే, జీవిత గ్రంథానివి.
కనుక, తృప్తిగా, సంతోషంగా వుండు.
నిన్ను పాలించే వారి ధర్మానికి, నువ్వే మూల శక్తివి.
నిన్ను నడిపే వారి నీతికి, నువ్వే ధ్వజ స్తంభానివి.

నా, దుఃఖిత మిత్రమా, నువ్వు చూడగలిగితే—
జీవితంలో నిన్ను ఓడించిన దురదృష్టమే,
నీ హృదయాన్ని ప్రకాశింపజేసి,
నీ ఆత్మను పరిహాసపు అగాధం నుంచి భక్తి సింహాసనానికి
ఎత్తే శక్తి అని నువ్వు స్వానుభవంతో తెలుసుకుంటే,
నీకు వున్న దానితో నువ్వు తృప్తిపడతావు.
నీకు సలహా ఇచ్చేందుకూ, నిన్ను వివేకవంతుణ్ణి చేసేందుకు
నీకు ఇవ్వబడినదాన్నే మరణశాసన పూర్వకంగా
నీకు రాసి ఇచ్చిన సొత్తుగా నువ్వు భావించుకుంటావు.

జీవితమంటే, అనేక రకాల కొక్కాలతో
తయారుచేయబడ్డ గొలుసు.

వర్తమానంలో లొంగివున్నదానికి,
భవిష్యత్తు వాగ్దత్తపు ఆశకీ మధ్యనున్న
బంగారు కొక్కెమే, దుఃఖం.

నిద్రకీ - మెలకువకీ మధ్య వున్నదే - దుఃఖం.

నా తోటి దుర్బలులారా, మీ మనోదౌర్బల్యాన్ని
కలిమి బహిరంగ పరిస్తే,
ఆత్మ ఔన్నత్యాన్ని లేమి అలంకరిస్తుంది.

మనోభావాల్ని దుఃఖం, మృదుమధురంగా తీర్చిదిద్దితే,
గాయపడిన హృదయాన్ని ఆనందం కోలుకునేటట్లు చేస్తుంది.

జీవితంలో దుఃఖాన్ని, దరిద్రాన్ని నిషేధిస్తే,
ఇరువైపులా "స్వార్థ పరత్వం - లోభత్వం" తప్ప
మరి ఎటువంటి ముద్రాలేని నాణెంవలె వుంటుంది,
మానవుని ఆత్మ.

"మానవుని సత్యాతే, దైవత్వం" అని జ్ఞాపకముంచుకో!
అది బంగారానికి అమ్ముడు కాదు.
ఈనాటి ప్రపంచ ఐశ్వర్యాల మాదిరిగా అది పోగుపడదు.
ధనవంతుడు తన దైవత్వాన్ని విసిరేసి,
బంగారానికి అతుక్కున్నాడు.
ఈ కాలపు పడుచువారు, తమ దైవత్వాన్ని విసర్జించి
సుఖ - సంతోషాల వెంటపడుతున్నారు.

నా ప్రియమైన దుర్బలులారా,
మీరు పొలం నుంచి ఇంటికి తిరిగి వచ్చి,
మీ భార్యా - పిల్లలతో గడిపిన కొద్దికాలం,
ముందు తరాలవారికి వాస్తవమైన
ఆనంద చిహ్నంగా గోచరిస్తుంది.

కాని, నిజానికి ధనవంతుడు బంగారం పోగుచేసుకోవడానికి
గడిపేకాలం, సమాధిలోని కీటకాల జీవితంవలె వుంటుంది.
అది, భయానికి చిహ్నం.

దుఃఖించే నా మిత్రమా, నువ్వు కార్చిన కన్నీరు—
మరచి పోజూసేవాని నవ్వుకన్నా, పవిత్రం.
తిరస్కరించేవాని వెక్కిరింపుకన్నా, మధురం.

ద్వేషంవల్ల నాశనమైన హృదయాన్ని,
ఆ కన్నీరు ఒక్కటే బాగు చేస్తుంది.
భగ్నహృదయాల వ్యథను పంచుకోమని,
ఆ కన్నీరు మానవునికి బోధిస్తుంది.

ఏసు ప్రభువును నిజంగా అనుసరించిన నజరత్‌వాసుని కన్నీరు,
ప్రకృతి ధర్మం ప్రకారం, ప్రతిదీ తిరిగి మూలస్థానం చేరుకున్న
ధనవంతుని కొరకు నువ్వు వ్యయపరచిన శక్తి,
సకాలంలో కోతకు వచ్చే పంట మాదిరిగా వుంటుంది.
నువ్వు భరించిన దుఃఖం, స్వర్గాదేశం ప్రకారం
సంతోషంగా మారుతుంది.
ఈనాటి దుఃఖ - దరిద్రాలను, ముందుతరాలవారు,
ప్రేమ - సమత్వాల పాఠాలుగా, నేర్చుకుంటారు.

*  *  *

# 10

ఆదినుంచీ నేను ఇక్కడే వున్నాను.
అంతం వరకు నేను ఇక్కడే వుంటాను.
ఈ, నా ఉనికికి అంతంలేదు.
సృష్టి ఆరంభంలో విరాట్ పురుషుడు తననుంచి
వేరుచేసిన దివిటీనుంచి విడిపడ్డ వెలుగు రవ్వే,
మానవుని ఆత్మ.

ఓ, నా సోదరులారా, ఒకరి ఆలోచనల్ని ఒకరు గ్రహించండి.
అవగాహనలోనే - అన్వేషణలోనే పొరపాట్ల నుంచీ,
పనికిమాలిన పశ్చాత్తాపాల నుంచి బైటపడే మార్గం వుంది.
పరస్పర అవగాహన వల్ల, శత్రు సంఖ్య తగ్గుతుంది.
అనేకుల అనుభవ జ్ఞానమే,
నిరంకుశత్వాన్ని ఎదుర్కొనే కవచం.

సలహా అర్థించని వాడు, అవివేకి.
ఆ అవివేకమే, అతని సత్యానికి అంధుణ్ణి చేయడమే కాదు;
అతన్ని చెడ్డవానిగా - మొండివానిగా—
ప్రక్కవానికి ప్రమాదకరమైన వానిగా తయారు చేస్తుంది.

ఒక సమస్యను మనస్సంతటితో తీసుకుని
గమనించినప్పుడు,
దాన్ని, అంతటి దృఢ చిత్తంతోనే ఎదుర్కొవాలి.
అదే బలవంతుల మార్గం.

పెద్దల సలహా ఆపేక్షించు.
వారి కళ్ళు, కాలంలో ఎన్నో సంగతులు చూసి వుంటాయి.
వారి చెవులు, ఎన్నో జీవితానుభవాల్ని ఆలకించివుంటాయి.
వారి సలహా, నీకు అయిష్టంగా వున్నా,
వారు చెప్పే వాటిని శ్రద్ధగా విను.

నిరంకుశులనుంచి, అధర్మ పరుల నుంచి
అగౌరవ పరులనుంచి, అహంకారుల నుంచి
మంచి సలహా ఆపేక్షించకు.
సలహాకై వచ్చిన అధర్మపరులతో కలసి, కుట్ర చేసేవానికై
దుఃఖించు,

అన్యాయాలు చేసేవానితో ఏకీభవించడం; అపఖ్యాతి.
అసత్యమైనది వినడం, ద్రోహం.

అపార జ్ఞాన సంపద, సూక్ష్మమైన బుద్ధి నిర్ణయం,
ఉన్నతానుభవం లేకపోతే,
మానవులకు సలహాదారునిగా నన్ను నేను ఎంచుకోలేను.

ఆగి - ఆలోచించి - ముందుకు నడు.
అవకాశం సొంతం చేసినప్పుడు, సోమరిగా వుండకు.
మెలకువతో వున్నప్పుడే, ప్రమాదకరమైన
తప్పులనుంచి తప్పించుకో గలుగుతావు.

ఓ, నా మిత్రమా, చలిమంట ప్రక్కన కూర్చుని,
ఆరిపోయే నిప్పును చూస్తూ, చల్లారిన బూడిదమీద
వ్యర్థంగా ఊదేవానివలె వుండకు.

ఆశ, వదలకు. నిరాశకు, లొంగకు.
తిరిగి సంపాదింప శక్యంకాకుండా గతంలో కలిసిపోయిన దానికి
దుఃఖించడం, మానవ దౌర్బల్యాల్లో మిక్కిలి చెడ్డది.

గతంలో నేను చేసిన పనికి, నిన్న పశ్చాత్తాపపడ్డాను.
నేను, నా వింటిని విరిచి, అమ్ముల పొదిని నాశనం
చేసినప్పుడు,
నా మీదికి తెచ్చిపెట్టుకున్న చెడునీ, పొరపాటునీ
ఈ రోజు తెలుసుకున్నాను.

ఓ, నా సోదరా, నువ్వు చర్చిలో ఆరాధించినా,
ఆలయంలో మొకరిల్లినా, మశీదులో ప్రార్థించినా,

నువ్వు ఎవరివైనా, నిన్ను నేను ప్రేమిస్తాను.
నువ్వు - నేను - మనమంతా ఒకే విశ్వాసానికి పిల్లలం.

అందరివైపు విస్తరించి—
అందరికీ ఆత్మ సంపూర్ణత్వాన్ని సమర్పించి,
అన్నింటినీ ఆలింగనం చేసుకోవడానికి ఆరాటపడే
ఆ పరమేశ్వరుని అమృత హస్తాంగుళీయాలే—
వివిధ మత మార్గాలు.

ప్రేమ - స్వేచ్ఛలతో నిండిన ఈ విశాల విశ్వంలో
విహరించేందుకు, ఈశ్వరుడు నీకు రెక్కలుగల
ఆత్మను ప్రసాదించాడు.
ఆ రెక్కల్ని నీ చేతులారా నువ్వే నరుక్కుంటే,
కీటకం మాదిరిగా భూమిమీద పాకడానికి
నీ ఆత్మ బాధపడటం దీనమైన స్థితి కాదా?

ఓ, నా ఆత్మా!
జీవితం, రాత్రి పరిగెత్తే అశ్వం మాదిరిగా వుంది.
దాని వేగం పెరిగే కొద్దీ,
ఉదయకాలం దగ్గర అవుతుంది.

# 11

ఓ సమీరమా, నువ్వు ఒక క్షణం మృదు మధురంగా
పాడతావు. మరుక్షణం నిట్టూర్పుతో, దుఃఖిస్తో
మా పక్కనుంచి దూసుకుపోతావు.
మేము నిన్ను వింటాం. నీ స్పర్శను అనుభవిస్తాం. కాని,
నీ రూపాన్ని చూడలేము.
నువ్వు మా ఆత్మల్ని మింగే ప్రేమ సాగరం మాదిరిగా వున్నావు.
కాని, నువ్వు వాటిని ముంచెయ్యవు.

నువ్వు కొండలు ఎక్కుతావు. లోయల్లోకి దిగుతావు.
పొలాల్లో - పచ్చిక మైదానాల్లో వ్యాపిస్తావు.
పైకి ఎక్కడంలో శక్తి, కిందికి దిగడంలో శాంతం నీలో వున్నాయి.
ఆ, నీ కదలికల్లో ఎంతో అందం వుంది.
అణగారిపోయిన వారి యెడల దయచూపే
కరుణామయుడైన ప్రభువు మాదిరిగా వున్నావు. కాని,
దురహంకారుల, మదోన్మత్తుల యెడల కఠినంగా వుంటావు.

శిశిరంలో నువ్వు లోయలగుండా దుఃఖిస్తో
మూలుగుతో వెడతావు.
నీ దుఃఖాన్ని చెట్లు ప్రతిధ్వనింప జేస్తాయి.
శీతాకాలంలో నువ్వు బంధాల్ని తెంచుకుంటావు.
నీతోపాటు ప్రకృతంతా తిరగబడుతుంది.

నువ్వు ఇంకా దుర్బలంగా - బలహీనంగా వున్నా,
వసంతం రాగానే నువ్వు ఉత్తేజితురాలవు అవుతావు.
నీ మృదు కదలికల్లో, హేలాలు నిద్ర మేల్కొంటాయి.

"సూర్యకిరణా"లనే బాణాల చేతా, "అగ్ని" అనే ఈటెల చేతా
పొడిచి చంపబడ్డట్లుగా వేసవిలో నువ్వు
మౌన ముసుగు వెనక దాక్కుంటావు.

శిశిరం చివరి రోజుల్లో నువ్వు నిజంగా ఏడుస్తావా? లేక,
ఆకులు రాల్చిన చెట్లు సిగ్గు పడటం చూసి పరిహసిస్తావా?
శీతాకాలంలో ఆగ్రహంతో వుంటావా?
రాత్రి మంచుతో అలంకరించబడ్డ సమాధి చుట్టూ
నాట్యం చేస్తావా?

వసంత కాలంలో నువ్వు నిజంగా బడలికగా వుంటావా?
లేక, ఋతువులన్నింటిలోనూ యువ్వనవంతమూ,
నీకు ప్రియతమమూ అయిన వసంతం పోతుందని
విచారిస్తావా?

వేసవికాలంలో నువ్వు మరణిస్తావా? లేక,
ఫల హృదయాల్లో, ద్రాక్ష తోటల నయనాల్లో
గోధుమ నూర్చిన కళ్ళాల వీనుల్లో నిద్రిస్తావా?

నగర వీధుల్లోంచి పైకెగసి, ప్లేగు రోగ క్రిముల
సంతానాన్ని మోసుకుపోతావు.
కొండల్లోంచి పూల పరిమళంతో దూకుతూ వెడతావు.
అలాగే, మహాత్ములు జీవిత దుఃఖాన్ని భరించి,
జీవితానందాన్ని నిశ్శబ్దంగా అనుభవిస్తారు.

గులాబి పువ్వు చెవిలో నువ్వు రహస్యం ఒకటి చెబితే,
ఆ రహస్యాన్ని అది గ్రహిస్తుంది. ఆ రహస్యం విని,
తరచు ఆ గులాబి పువ్వు వేదన పొలొతుంది.
మళ్ళా అంతలోనే సంతోషిస్తుంది.
మానవుని ఆత్మతో ఈశ్వరుడు క్రీడించే విధమూ అంతే!

ఓ సమీరమా, ఈ క్షణంలో నువ్వు ఇక్కడ వుంటావు.
అంతలోనే, వెళ్ళడానికి ఆరాటపడతావు.
మరుక్షణంలో అల్లంత దూరాన కనుపిస్తావు.
నిరంతరం చలిస్తావు.
పని చేస్తున్నప్పుడు మానవుని మనస్సు సజీవంగా వున్నట్లూ,
సోమరిగా వున్నప్పుడు, ఆ మనసు మరణించినట్లు వుంటుంది.

నువ్వు నీటి ఉపరితలాన పాటలు రాసి,
మరుక్షణంలో వాటిని చెరిపేస్తావు.
కవికూడా తాను సృష్టించిన వాటిని అట్లాగే తుడిచేస్తాడు.

దక్షిణంనుంచి నువ్వు ప్రేమంత నులివెచ్చగా,
ఉత్తరంనుంచి చావంత చల్లగా,
తూర్పునుంచి ఆత్మ స్పర్శ అంత మృదువుగా,
పడమరనుంచి ఆగ్రహం, ఉగ్రం అంత తీవ్రంగా వీస్తావు.
నువ్వు, వయస్సంత చంచలమా? లేక,
భూమి నాలుగు మూలల నుంచీ బరువైన వార్తల్ని
తెచ్చే దూతవా?

నువ్వు ఎడారులగుండా ఆగ్రహంతో వీస్తో,
అమాయకపు బాటసారుల సమూహాల్ని,
నీ కాళ్ళకింద తొక్కేసి, ఇసుక దిబ్బలకింద పూడ్చిపెడతావు.

ఎక్కడ పువ్వులు నమ్రతతో తలలు వంచుతాయో,
నీ మృదు శ్వాసతో ఎక్కడ పచ్చగడ్డి మత్తెక్కి
వాలిపోతుందో, ఆ లోయలగుండా కలలు మాదిరిగా
ఎగిరిపోయే నువ్వూ, ఉషాగమనంతో
ఆకుల్ని, చెట్ల కొమ్మల్ని వణికించే నువ్వూ;
గంతులువేసే మలయమారుతం ఒకటేనా?

నువ్వు సముద్ర గర్భాల్లోంచి పైకి లేచి,
వాటి మౌనపు లోతుల్ని నీ సుడిగుండాలతో కదిలిస్తావు.
తీవ్రమైన కోపంతో ఓడల్ని, అందున్న ప్రయాణీకుల్ని
నాశనం చేస్తావు.
తమ ఇంటి చుట్టూ ఆడుకుంటున్న చంటిపిల్లల
ముంగురులను ముద్దు చేసే ఆ మృదు సమీరానివి, నువ్వేనా?

మా హృదయాల్ని, నిట్టూర్పుల్ని, శ్వాసల్ని, నవ్వుల్ని
నువ్వు ఎక్కడికి మోసుకుపోతావు?
ఎగిరే దివిటీలవంటి మా ఆత్మల్ని ఏం చేస్తావు?
వాటిని జీవన దిగంతాల ఆవలకు మోసుకుపోతావా?
లేక, యజ్ఞ పశువులుగా వధించడానికి
వాటిని, దూరాన వున్న భయంకరమైన గుహలకు
ఈడ్చుకుపోతావా?

రాత్రి నిశ్శబ్దంలో హృదయాలు తమ రహస్యాల్ని
నీకు వ్యక్త పరుస్తాయి.
ఉదయాన నీ మృదు స్పర్శతో అవి తమ కళ్ళు తెరుస్తాయి.
హృదయం ఏం అనుభవించిందీ, కళ్ళు ఏం చూసిందీ
నీకు తెలుస్తుందా?

అతి వేదనాపరుడు విచారకరమైన తన పాటల
ప్రతిధ్వనుల్నీ,
దిక్కుమాలిన వాడు బద్ధమైన తన హృదయపు తునకల్నీ,
అణగారినవాడు బాధాకరమైన తన నిట్టూర్పుల్నీ,
నీ రెక్కల మధ్య వుంచుతారు.
అపరిచితుడు తన వాంఛల్నీ, నిరాకరించబడ్డవాడు
తన భారాన్నీ, పతనమైన స్త్రీ, తన నిరాశనూ,
నీ ఉత్తరీయపు మడతల్లో వుంచుతారు.

ఏటి నన్నింటినీ నమ్రుల కోసం భద్రపరుస్తావా?
లేక, తననుంచి ఉద్భవించే వాటిని, తిరిగి తనే
సమాధి చేసే మాతృభూమి మాదిరిగా వున్నావా?

ఈ ఏడుపుల్నీ - దుఃఖాల్నీ - మూలుగుల్నీ - నిట్టూర్పుల్నీ
నువ్వు వింటావా? లేక, బీదలు చాచిన చేతిని చూడని,
వాళ్ళ ఏడుపుల్ని వినని గర్విష్టి - బలిష్టి మాదిరిగా వున్నావా?
శ్రోతలందరి జీవితమా,
నువ్వు వింటున్నావా?

# 12

యవ్వనారంభంలో ఒక యువకుడు
తన ఏకాంత గృహంలో రాత బల్లముందు కూర్చుని,
నక్షత్రకాంతితో మెరుస్తోన్న ఆకాశాన్ని కిటికీలోంచి చూసి,
ఆ తర్వాత తన చేతిలో వున్న ఒక కన్య చిత్రపటం మీదికి
తన దృష్టి మరల్చాడు.
ఆ చిత్రపటంలోని రంగులూ - రేఖలూ నిపుణుడైన
ఒక చిత్రకారుని ప్రతిభను వెల్లడిస్తున్నాయి.
ఆ రంగులూ - రేఖలూ అతని హృదయంలో ప్రతిఫలించి,
విశ్వ రహస్యాల్ని, అనంతత్వ నిగూఢత్వాన్ని
అతనికి బహిరంగ పరిచాయి.

ఆ చిత్రపటంలో వున్న కన్య, ఆ యువకుణ్ణి పిలిచింది.
తక్షణం అతని కళ్ళు, చెవులుగా మారడంతో,
విశ్వవ్యాప్తమైన ఆత్మల భాషను అతను
అర్థం చేసుకోగలిగాడు.
క్రమంగా అతని హృదయం, ప్రేమాగ్నితో ప్రజ్వరిల్లింది.

వాళ్ళిద్దరూ, సుందరమైన స్వప్నంలో ఒక క్షణకాలమో,
అనంతత్వ జీవనంలో ఒక దీర్ఘ సంవత్సరమో
గడిపినట్లు అనుభూతి చెందారు.

అతడు కలం తీసుకుని, ఆ కన్య చిత్రపటాన్ని ముందుంచుకుని,
తన హృదయానుభూతుల్ని, ఒక కాగితం మీద కుమ్మరించాడు.

ఓ ప్రియతమా, కాలాతీతమైన సత్యం,
మామూలు మాటల ద్వారా ఒకరి కొకరికి అవగతం కాదు.
ప్రియతములైన ఆత్మీయులకు,
తనఅర్థాన్నినివేదించుకునేందుకు"సత్యం"మౌనాన్నిఎన్నుకుంటు

రాత్రి నిశ్శబ్దమే మన రెండు హృదయాల మధ్య
"ఉన్నతమైన దూత" అని నేను ఎరుగుదును.
ఆ దూత, మన ప్రేమ సందేశాల్ని మోసుకొస్తుంది.
మన హృదయాల భక్తి గీతాల్ని పాడుతుంది.
ఈశ్వరుడు మన ఆత్మల్ని దేహాల్లో బంధించినట్లు,
ప్రేమ, నన్ను మాటల్లో బంధించింది.

ఓ ప్రియతమా! ఆ ప్రేమను,
మానవ హృదయంలో "కబళించే ఒక జ్వాల" అని అంటారు.
నేను, నిన్ను యుగయుగాల నుంచి ఎరుగుదును అన్నది—
మన మొదటి సమాగమ మప్పుడే తెలుసుకున్నాను.
మనల్ని విడదీసే బలీయమైన శక్తి ఏదీ లేదన్న సంగతి,—
మనం విడిపోతున్న క్షణంలో తెలుసుకున్నాను.

నిజం చెప్పాలంటే, నేను నిన్ను చూసిన మొదటి చూపు,
నిజంగా అదే తొలిసారిగా చూసిన చూపు కాదు.
అనంతత్వంలో - ఆత్మశాశ్వతత్వంలో నాకు గల నమ్మకాన్ని,
మన హృదయాలు కలుసుకున్న క్షణంలోనే స్థిర పరచింది.

అణగారిపోతున్నాననుకునే వానినుంచి, ప్రకృతి
తక్షణం తన ముసుగును తొలగించి,
అనంతమైన తన ధర్మాన్ని బహిరంగ పరుస్తుంది.

ప్రియతమా, మనం ఒకరినొకరం చూసుకుంటూ, కూర్చున్న
ఆ సెలయేటి గట్టును, నువ్వు ఎప్పుడైనా జ్ఞాపకం చేసుకుంటావా?
నీ ప్రేమ, జాలివల్ల కాక; ధర్మం నుంచి ఉద్భవించిందని
ఆ క్షణాన నీ కళ్ళు నాకు చెప్పడం, నువ్వు ఎరుగుదువా?
దాతృత్వం నుంచి లభించిన కానుకల కన్నా,
ధర్మం నుంచి ఉత్పన్నమైన కానుకలు గొప్పవని
ఇప్పుడు నేను, నాకేగాక, యావత్ ప్రపంచానికి
చాటి చెప్పగలను.

అకస్మాత్తుగా తటస్థపడ్డ ప్రేమ వ్యవహారం,
బురద నేలలో నిలకడగా వున్న తేటనీరు వంటిదని
కూడా, నేను చెప్పగలను.

ప్రియతమా, అందంలోకీ, ఔన్నత్యంలోకి
పరిణతి చెందింపగల జీవితం, నా ముందు
పరచుకుని వుంది.
అది, మన ప్రథమ సమాగమంతో ఆరంభమైన జీవితం.
అది కాలాంతం వరకు వుంటుంది.

పొలాల్లో పరిమళవంతమైన పువ్వుల్ని,
సూర్యుడు చైతన్యవంతం చేసినట్లు,
గొప్ప మాటల్లో - చేతల్లో మూర్తీభవించేందుకు
ఈశ్వరుడు నామీద వుంచిన శక్తిని ప్రకటించే సామర్థ్యం,
ఒక్క నీలోనే వుందని నాకు తెలుసు.

నీ కోసం నా ప్రేమ ఎప్పటికీ ఈ విధంగానే వుంటుంది.

ఆ యువకుడు పైకి లేచి, అటూ - ఇటూ తిరిగి,
కిటికీదగ్గరకు వెళ్ళి, విశాలమైన ఆకాశాన్ని,

ఉదయిస్తున్న చంద్రుడు తన తెల్లని - చల్లని
లేత వెన్నెలతో దిగంతాల వరకు ప్రకాశింప జేయడం చూసి,
మళ్ళా తన రాత బల్లముందు కూర్చుని—
"నా ప్రియతమా, నన్ను క్షమించు;
నేను, నిన్ను "నువ్వు" అని వేరుచేసి మాట్లాడినందుకు.
మనం ఈశ్వరుడి అమృతహస్తాల నుంచి ఉద్భవించినప్పటి
నుంచీ,
నా పాపంలో, రూపం - నాలో సగభాగం - నా అర్థాంగివి
అయిన "నువ్వు," ఇన్నాళ్ళూ నాకు లేకుండా వున్నావు.
నన్ను క్షమించు, "ప్రియతమా, "అని రాసి ముగించాడు.

* * *

# 13

రాత్రి నిశ్శబ్దంలో "జ్ఞానం" నాశయ్య దగ్గరకు వచ్చి, నిలబడి
మాతృ ప్రేమతో నా వంక చూసి, నా కన్నీళ్ళు తుడుస్తో—
"నీ ఆత్మ ఆక్రందనాల్ని విని, నిన్ను ఓదార్చడానికి వచ్చాను.
నీ హృదయాన్ని నాకు తెరు. దాన్ని తేజస్సుతో నింపుతాను.
అడిగితే, సత్య మార్గంకూడా చూపుతాను," అన్నది.

ఆమె ఆజ్ఞానుసారం నేను ఇట్లా అడిగాను—
"జ్ఞానమా, నేనెవరిని?
భయంకరమైన ఈ భూమండలానికి నేను ఎట్లా వచ్చాను?

బలీయమైన ఈ వాంఛలూ - గుట్టలు గుట్టలుగా వున్న
ఈ గ్రంథాలూ - ఈ విభిన్నరూపాలూ ఏమిటి?
పావురాల గుంపులవలె వచ్చి - పోయే ఈ ఆలోచనలు ఏమిటి?
కాంక్షతో కూర్చి, ఆనందంతో లిఖించే ఈ పదజాలమేమిటి?
నా ఆత్మను ఆలింగనం చేసుకుని, నా హృదయాన్ని కప్పే
ఈ దుఃఖమయ - ఆనందమయ నిర్ణయాలేమిటి?
నా అంతరాత్మను గుచ్చుతూ, నా వంక తదేకంగా చూస్తో
నా దుఃఖాన్ని మరపించే ఈ చూపులెవరివి?
కాలం గతిస్తోందని దుఃఖిస్తో, బాల్యాన్ని స్తుతిస్తో పాడే
ఈ కంఠ రవాలేమిటి?

నా కోర్కెలతో ఆటలాడుతూ, నా భావాల్ని వెక్కిరిస్తూ
నిన్నటి పనుల్ని మరిపించి, ఈనాటి అల్పమైనదానితో సంతోషించి,
తృప్తిపడి, నెమ్మదిగా సమీపించబోయే రేపటి దానికి
వ్యతిరేకంగా ఆయుధాలు ధరించే భయంకరమైన
ఈ యవ్వనం ఏమిటి?
నన్ను కదిలించి ఏ అజ్ఞాత తీరాలకో తరలించే భయంకరమైన
ఈ ప్రపంచం ఏమిటి?
మన శరీరాల్ని కబళించేందుకూ,
అత్యాశకు శాశ్వత రక్షణ కల్పించేందుకూ,
తన నోటిని విశాలంగా తెరచే ఈ భూమి ఏమిటి?
అదృష్టాను గ్రహంతో తృప్తిపడుతూ,
ముఖంమీద మృత్యువు చావుదెబ్బ కొడుతున్నా,
బాహ్య జీవిత కాంక్షవల్ల, దాని పెదవుల నుంచి
ముద్దును తీవ్రంగా ఆకాంక్షించే ఈ మనిషి ఎవరు?

సంవత్సర కాలం హెచ్చించి, పశ్చాత్తాపం అనుభవించడానికి
సిద్ధపడి, క్షణిక సుఖాన్ని కొనుక్కుని, కలలు పిలుస్తున్నా, నై
నిద్రపోయే ఈ నరుడెవరు?
అంధకార అగాధం వైపు, అజ్ఞాన తరంగాలమీద ఈదులాడే
ఈ మానవుడెవడు?
జ్ఞానమా, ఇవన్నీ ఏమిటో చెప్పు?" అని అడిగాను.
వాటికి సమాధానంగా జ్ఞానం ఇట్లా అన్నది:

ఓ మానవుడా,
ఈశ్వర నేత్రాలతో ఈ ప్రపంచాన్ని చూడాలను కోవడం,
మానవ ఆలోచనా విధానంతో పరలోక రహస్యాలన్ని,
గ్రహించాలను కోవడం.
యీ ప్రపంచం, అజ్ఞాన ఫలితం.
పొలాల్లోకి వెళ్ళు. మధుపూరిత పుష్పాలపై
తేనెటీగ ఏ విధంగా తిరుగుతుందో చూడు.
రెక్కలు ఆడించకుండా ఆకాశంలో తేలియాడి,
వలయాలుగా తిరిగే గ్రద్ధ, భూమిమీద వున్న ఆహార పదార్థా
ఏ విధంగా తన్నుకు పోతుందో గమనించు.
నీ పొరుగువాని ఇంటికివెళ్ళి, తల్లి పనుల తొందరలో వున్న
పొయ్యిలోని మంటను చూసి, బిడ్డ ఏ విధంగా పరవశిస్తాడో
తేనెటీగ మాదిరిగా వుండు.

గ్రద్దచేసే పనులవంక తదేకంగా చూస్తే,
వసంతకాలపు లీలను వ్యర్థం చేసుకోకు.
పొయ్యిలోని మంటను చూస్తే, పరవశించే పసిబిడ్డ మాదిరిగా
వుండు. ఆ తల్లిని అట్లానే పనుల్లో మునిగి వుండనియ్యి.
చూసిందీ - చూస్తున్నదీ - చూసేదీ - అంతా నీచే.

ీ ముందున్న గ్రంథాలూ - వింత వింత ఆకృతులూ—
ీ చుట్టూ వున్న అందమైన ఆలోచనలూ—
అన్నీ విశ్వాత్మ యొక్క విభిన్నరూపాలు,
న్నూ - నీ సహవాసుల్నీ కలిపే గొలుసులోని కొక్కాలు,
పెదవులు ఉచ్చరించే మాటలు.

విష్యత్తులో పంట కోసుకునేందుకు
ఆత్మ క్షేత్రంలో చల్లిన విత్తనాలే—
ఃఖమయమూ, ఆనందమయమూ
యిన నిర్ణయాలు.
ంతి ప్రవేశించేందుకై, నీ హృదయ కవాటాన్ని
రిచే హృదయమే, నీ కోర్కెలతో ఆటలాడుకుంటుంది.
హ బాధల నుంచి, మన ఆత్మల్ని కాపాడే భూమే,
నిషిని, అతని పనుల్ని దిగమింగడానికి
న నోటిని విశాలంగా తెరుస్తుంది.

తో, కదిలే ప్రపంచమే, మనసు.
మనసే, యీ ప్రపంచం.

దుఃఖం ద్వారా జీవితానందాన్ని తెలుసుకోవడానికి,
జ్ఞానం నుంచి జ్ఞానాన్ని సంపాదించడానికి
చ్చిన వానిని, "అల్పుడు - అజ్ఞాని" అని
రు ఎవరిని పిలుస్తున్నారో;
తడే ఈశ్వర దూత, "అన్నది జ్ఞానం.

ానం ఆ విధంగా మాట్లాడి,
మండుతున్న నా నుదుటి మీద చెయ్యేసి,
"ముందుకు సాగిపో. ఆగవద్దు.

సాగిపో. పురోగమనమే సంపూర్ణత్వం వైపు
కదలడం. ముందుకు నడు.
జీవిత బాటమీది ముళ్ళకూ, వాడి రాళ్ళకూ
భయపడకు. ముందుకు సాగిపో," అన్నది
జ్ఞానం.

* * *

# 14

జీవితం, నన్ను తన రెక్కలమీద కూర్చోబెట్టుకుని,
మౌంట్ యూత్ శిఖరానికి మోసుకుపోతూ,
తన వెనక దేన్నో సౌంజ్ఞచేసి నాకు చూపించింది.
నేను వెనక్కి తిరిగి చూశాను.
ఒక వింత పట్నం కనుపించింది.
ఆ పట్నం నుంచి దెయ్యంవంటి నల్లని పొగ—
అనేక ఆకారాల్లో నెమ్మదిగా కదలడం చూశాను.
పల్చని ఒక మబ్బుతెర
ఆ పట్నాన్ని నా దృష్టినుంచి కప్పేసింది.

ఒక క్షణం నిశ్శబ్దంగా వుండి, "జీవితమా, నేను చూసే
ఇదంతా ఏమిటి?" అని ఆశ్చర్యంతో అడిగాను.
"అది, "గతం" అనే పట్టణం. దాన్ని చూసి, యోచించు," అన
అనేక వస్తువులతో, విషయాలతో, వింతలతో,

వేడుకలతో ఆశ్చర్యం గొలిపే ఆ దృశ్యాల వంక
ఏదేకంగా చూసి, యోచించాను:

"నిద్రమత్తు" అనే రెక్కల కింద, రాక్షసుల్లా నిలబడి వున్న
నాట్య మందిరాల్ని,
మూక ఉమ్మడిగా నిరాశతో అరుస్తో, ఆశాగీతాల్ని
ఆలాపిస్తో, ఉపన్యాస మందిరాల చుట్టూ తిరిగే ఆత్మల్ని,
విశ్వాసంతో నిర్మింపబడి, సంశయంతో నాశనం చేయబడ్డ
చర్చిలను చూశాను.
బిచ్చగాళ్ళు చేతుల్ని పైకెత్తి చాచినట్లు, ఆలోచనా పర్వతాలు
తమ శిఖరాల్ని పైకెత్తడం, నేను చాటుగా వుండి చూశాను.

లోయల గుండా నదులవలె పరచుకుని ప్రవహిస్తున్న
కోరికలనే వీధుల్ని చూశాను.
కాపలాదార్లచే రక్షింపబడే "రహస్యాలు" అనే
గిడ్డంగులు, "బహిరంగపరచడం" అనే దొంగలచేత
అవి కొల్లగొట్టబడటం చూశాను.
"పరాక్రమం" అనే గోపురాలు, శౌర్యంచేత పైకి లేవడం,
"భయం" చేత అవి నేల కూలడం చూశాను.
కలల గర్భాలయాలు, నిద్ర మత్తులో అలకరింపబడటం,
అవి మెలకువతో నాశనం కావడం చూశాను.
బలహీనం కాపురం చేసే పూరి గుడిశల్ని,
"ఒంటరి తనం - ఆత్మ నిరాకరణ" అనే మశీదుల్ని,
జ్ఞానంతో ప్రకాశించి, అజ్ఞానంతో ఆరిపోయిన విద్యా సంస్థల్ని
చూశాను.

మధురమైన పానశాలల్లో తాగి, మత్తులో పడివుండే
ప్రేయసీ - ప్రియుల్ని "శూన్యం" చూసి, ఎగతాళి చేయడం;

నాటకశాలల్లో "జీవితం" తన ఆటను అభినయించడం,
జీవిత విషాదాన్ని మృత్యువు కబళించడం చూశాను.

"గతం" అనే పట్టణం ఆ విధంగా వుంది.
వాస్తవానికి అది దగ్గరగా వున్నా, దూరంగా వున్నట్లు
కనబడుతోంది.
అది స్పష్టంగా గోచరిస్తున్నా, నల్లని మేఘాలు
అడ్డురావడం వల్ల, మసక మసకగా కనబడుతోంది.

"నన్ను అనుసరించు. మనం ఇక్కడ చాలాసేపు
తాత్సారం చేశాం," అని జీవితం నాకు సౌంజ్ఞచేస్తూ చెప్పింది.
"జీవితమా, మనం ఇప్పుడు ఎక్కడికిపోతున్నాం" అని
అడిగాను.

"భవిష్యత్తు" అనే నగరానికి వెడుతున్నాం; అన్నది జీవితం.
"జీవితమా, నన్ను దయతలచు. నేను అలసిపోయాను
నా కాళ్ళు గాయమయ్యాయి. నాలోంచి శక్తి అంతా పోతోంది,
అన్నాను.

"నా మిత్రమా, ముందుకు నడు. వెనక దిగబడిపోవడం,
పిరికితనం.
గతమనే పట్టణాన్ని చూస్తూ, ఎప్పటికీ
నిలిచిపోవడం, మూర్ఖం,
భవిష్యత్తనే పట్టణం సౌంజ్ఞచేసి పిలుస్తోంది, చూడు!"
అన్నది జీవితం.

# 15

మానవుడు ఇంకా సుఖంగా, మత్తుగా నిద్ర పోతుండగా
నేను ఆ సూర్యోదయంవేళ పొలం గట్టున కూర్చుని,
ప్రకృతితో ముచ్చటిస్తున్నాను.
కొంతసేపు పచ్చగడ్డిలో పడుకుని—
"సత్యం, సౌందర్యమా? సౌందర్యం, సత్యమా?" అనే
ప్రశ్నలపై దీర్ఘంగా యోచించాను.

ఆ ఆలోచనల్లో నేను మానవజాతి నుంచి
దూరంగా కొట్టుకుపోయినట్లు అనిపించింది.
నా అంతరాత్మను కప్పిన మాయాముసుగును,
నా ఊహ పైకెత్తింది.
నా ఆత్మ విస్తరించింది.
ప్రకృతికీ, దాని రహస్యాలకూ నేను బహు సమీపవర్తి
నయ్యాను.
దాని అద్భుతాల భాషకు, నా చెవులు తెరచుకున్నాయి.

నేను ఆ విధంగా దీర్ఘాలోచనలో వుండగా,
చెట్ల కొమ్మల్లోంచి గాలి వీచింది.
దారి తప్పిన అనాథ శిశువువలె అది దుఃఖించడం విని,
"మృదువైన ఓ సమీరమా! ఎందుకు దుఃఖిస్తున్నావు అని
అడిగాను.

“ఎందుకా? సూర్యకాంతి తీక్ష్ణతలో ప్రకాశించే
పట్టణంనుంచి నేను వస్తున్నాను. ప్లేగు వ్యాధి క్రిములూ,
మురికి పదార్థాలూ శుభ్రమైన నా బట్టలకు, అంటుకున్నాయి
నేను దుఃఖిస్తున్నానని, నీవు నన్ను నిందిస్తున్నావా?”
అన్నది సమీరం.

ఆ తర్వాత కన్నీటి మరకలతోవున్న పువ్వుల
ముఖాల్ని చూసి, వాటి మృదురోదనల్ని విని,
“నా ప్రియాతి ప్రియమైన - అందమైన పువ్వులారా!
ఎందుకు ఏడుస్తున్నారు?” అని అడిగాను.

అందులో ఒక పువ్వు నాజూకైన తన తలను పైకెత్తి,
“ఎందుకా? మానవుడు వచ్చి, మమ్మల్ని త్రుంచి
పట్నం అంగడి వీధుల్లో అమ్మేస్తాడని
ఏడుస్తున్నాం,” అన్నది నెమ్మదిగా.

అంతలో మరో పువ్వు అందుకుని,
“సాయంత్రాలు మేము వాడిపోయినప్పుడు,
మమ్మల్ని విసిరి పెంటకుప్పలమీద పారేస్తారు.
మనిషి క్రూరహస్తం మమ్మల్ని మా జన్మస్థానం నుంచి
అకస్మాత్తుగా పెరికేస్తుందని ఏడుస్తున్నాం,” అన్నది.

చనిపోయిన బిడ్డకోసం రోదించే
తోడులేని తల్లి మాదిరిగా శోకిస్తున్న సెలయేరును చూసి,
“పవిత్రమైన సెలయేరా, ఏందుకు ఎడుస్తున్నావు?”
అని అడిగాను.

"ఎందుకా? మానవుడు నన్ను అలక్ష్యం చేస్తున్నాడు.
నన్ను నిరాకరించి, మాదైన పానీయాలను సేవిస్తున్నాడు.
పనికిమాలిన పదార్థాలు బైటకు తోసేందుకు,
నన్ను పాకీవానిగా ఉపయోగించుకుంటున్నాడు.
నా పరిశుద్ధత్వాన్ని అపరిశుద్ధం చేసి,
మా నిర్మలత్వాన్ని మురికిగా మార్చే పట్టణంలోకి
మేము బలవంతంగా వెళ్ళవలసి వచ్చినందుకు
ఏడుస్తున్నాం," అన్నది దీనంగా, ఆ సెలయేరు.

పక్షులు విచారించడం విని,
"అందమైన పిట్టల్లారా, ఎందుకేడుస్తున్నారు?" అని
అడిగాను.

ఆ పిట్టల్లో ఒకటి నా దగ్గరకు ఎగిరి వచ్చి,
ఒక చెట్టు కొమ్మ చివర కూర్చుని,
"ఆదాము కుమారులు మారణాయుధాలతో వచ్చి,
మేము వాళ్ళను హతమార్చే శత్రువులమైనట్లు
మా మీద యుద్ధం చేస్తారు.
మనిషి ఆగ్రహంనుంచి మాలో ఎంతమందిమి
తప్పించుకుని బైట పడగలమో తెలియదు గనుక,
ఇప్పుడే మేము ఒకరినుంచి ఒకరం శలవు తీసుకుంటున్నాం.
మేము ఎక్కడకు వెళ్ళినా,
మృత్యువు మమ్మల్ని వెంటాడుతూనే వున్నది," అన్నది.

అంతలో కొండల వెనక నుంచి సూర్యుడు పైకి లేచాడు.
వృక్షాగ్రాలు బంగారు మలాము చేసిన కిరీటాల మల్లె
మెరిశాయి.

"ప్రకృతి సౌందర్యాన్ని మానవుడు నాశనం ఎందుకు చెయ్యాలి?
అని నాలో నేను ప్రశ్నించుకున్నాను.

*　　　*　　　*

# 16

నా హృదయేశ్వరి నిన్న యీ గదిలో నా పక్కన కూర్చున్నది.
సర్వాంగ సుందరమైన ఆమె, తన శరీరాన్ని
యీ తల్పంపై వాల్చింది.
తరతరాల ద్రాక్ష సారాయిని, యీ స్ఫటిక పాత్రతో తాగింది.

నా హృదయం ప్రేమించిన ఆ స్త్రీ "మరపు - శూన్యం" అనే
దూరపు ప్రాంతానికి వెళ్ళిపోయింది కనుక,
ఇది గత స్వప్నం.

ఆమె చేతి వేళ్ళముద్ర, నా అద్దం మీద ఇంకా వుంది.
ఆమె శ్వాస పరిమళం, నా బట్టల మడతల్లో ఇంకా మిగిలే
వుంది.
మధురమైన ఆమె కంఠస్వర ప్రతిధ్వని,
యీ గదిలో ఇంకా వినవస్తూనే వుంది.
"బహిష్కృతం - స్మృతి విహీనం," అని పిలవబడే
దూరానవున్న లోయ ప్రాంతానికి,
నా హృదయం ప్రేమించిన ఆ స్త్రీ వెళ్ళిపోయింది.
నా శయ్య పక్కన ఆమె చిత్రపటం వేళ్ళాడుతోంది.

ఆమె నాకు రాసిన ప్రేమ లేఖల్ని, పచ్చలు, పగడాలు
పొదిగిన వెండిపెట్టెలో దాచుకున్నాను.
ఆమె తాకిన వస్తువుల నన్నింటినీ,
మూగపోయిన నిశ్శబ్దం, రాజ్యమేలే మరపులోకి
గాలి విసిరి వేసేవరకు, అవి నాతోపాటు
రేపటి వరకు వుంటాయి.

నేను ప్రేమించిన ఆ స్త్రీ—
మీరు, మీ హృదయాల్ని ఇచ్చి ప్రేమించిన
స్త్రీల మాదిరిగానే వుంది.
ఆమె, పావురమంత సాధువు. నాగుపాముంత నాజూకు.
ఆడంబరమైన నెమలి అంత, అందం. తోడేలంత ఖేకరం.
తెల్ల హంస అంత సొగసు. కాళరాత్రి అంత భయంకరం.
ఒక దేవతచేత రూపు - రేఖలు దిద్దబడ్డట్లు,
ఆమె ఒక వింత సౌందర్యంతో వుంది.
గుప్పెడు మన్ను గిన్నెడు సముద్రపు నురుగు కలిపి
తయారు చేసినట్లు వుంది, ఆమె.

నేను ఆమెను చిన్నప్పటినుంచీ ఎరుగుదును.
పట్నం వీథుల్లో తిరుగుతున్నట్లు,
నేను ఆమెను వోణీ అంచు పట్టుకుని,
ఆమె వెంట పొలాల్లోకి వెళ్ళేవాడిని.

నేను ఆమెను నా యవ్వనకాలం నుంచీ ఎరుగుదును.
నేను చదివిన పుస్తక పుటల్లో, ఆమె ముఖాకృతిని చూశాను.
చిన్న సెలయేటి గుసగుసల్లో, ఆమె అమరవాణి విన్నాను.

నా హృదయపు అసంతృప్తినీ, నా అంతరాత్మ రహస్యాల్ని
ఆమెకు వ్యక్తపరిచాను.

"శీతలం - శూన్యం - మరపు" - అనే సుదూర ప్రదేశానికి
ఆమె వెళ్ళిపోయింది.
నా హృదయం ప్రేమించిన స్త్రీ యే, జీవితం.
ఆమె సౌందర్యవతి. అందరి హృదయాల్ని ఆమె ఆకర్షిస్తుంది.
ఆమె, మన జీవితాలను తాకట్టుకు తీసుకుని;
మన ఆశల్ని వాగ్దత్తాల్లో పూడ్చిపెడుతుంది.

జీవితమే, స్త్రీ.
ఆమె - ప్రియుల ప్రేమాశ్రువుల్లో స్నానం చేస్తుంది.
తనకై బలైనవారి రక్తంతో, తలంటు స్నానం చేస్తుంది.
"పగటి వేళలు" అనే తెల్లని వస్త్రాలకు,
"రాత్రి" అనే నల్లని అంచువున్న బట్టల్ని ఆమె ధరిస్తుంది.
మానవ హృదయాన్ని, ప్రభువు సాన్నిహిత్యానికి చేరుస్తుంది.
కాని, వివాహం విషయంలో, ఆమె విరక్తినే చూపుతుంది.

తన సౌందర్యంతో మనల్ని దుర్మార్గానికి తిప్పే మోహినే,
జీవితం.
కాని, ఆమె జిత్తుల్ని తెలుసుకున్నవాడు,
ఆమె వశీకరణాల నుంచి తప్పించుకుని పారిపోతాడు.

# 17

నా ముందు నడుస్తున్న యవ్వనాన్ని కొంతదూరం
అనుసరించాను.
ఒక పొలం గట్టున ఆగి, తెల్ల గొర్రెల మందవలె
దిగంతంమీద అటూ, ఇటూ కదులుతున్న మబ్బుల్ని,
తమ ఆకుల్ని తిరిగి తమకు ఇవ్వమని
ఆకాశంవైపు చూస్తూ ఈశ్వరుణ్ణి ప్రార్థిస్తున్నట్లున్న
నగ్న వృక్షశాఖల్ని నాకు చూపింది, ఆ యవ్వనం.
'ఓ యవ్వనమా, మనం ఇప్పుడు ఎక్కడవున్నాం?'' అని అడిగాను.
'దిగ్భ్రమ అనే క్షేత్రంలో వున్నాం. మెలకువ తెచ్చుకో,'' అన్నది.
'మనం తక్షణం ఇక్కడ నుంచి వెళ్ళిపోదాం.
నిర్మానుష్యమైన యీ ప్రదేశం నన్ను భయపెడుతోంది.
యీ మబ్బుల దృశ్యాలూ, నగ్నవృక్షాలూ
నా హృదయాన్ని క్షోభ పెడుతున్నాయి,'' అన్నాను.
'ఓపికపట్టు. జ్ఞానారంభమే, కలవరం,'' అన్నది యవ్వనం.

చుట్టూ చూశాను.
ఒక స్త్రీ మా వైపు సొగసుగా నడచి రావడం చూసి,
"ఆమె ఎవరు?'' అని అడిగాను.
ఆమె, ప్రాచీనకాలపు గ్రీకు దేవతల రాజకుమారి—
విషాద దేవతైన ''మెల్ ఫోమిని,'' అన్నది.
"ఆనందమయమైన ఓ యవ్వనమా,

నువ్వు నా చెంతవుండగా ఆమె నా నుంచి ఏం కోరుతోంది," ఆ
ఆశ్చర్యంతో గట్టిగా అరిచాను.

"దుఃఖాన్ని చవి చూడని వారు,
ఆనందాన్ని ఎన్నటికీ అనుభవించలేరు కనుక,
భూమినీ, దాని తాలూకు దుఃఖాన్నీ
నీకు రుచి చూపించడానికి ఆమె వస్తోంది," అన్నది యవ్వనం.
ఆ రాజకుమార్తె నా దగ్గరకు వచ్చి
నా కళ్ళపై చెయ్యివేసి. కొంతసేపు వుంచి, తీసేప్పటికి
నా ముందున్న యవ్వనం అదృశ్యమైంది.
నేను ఏకాంతంగా, బట్టబయలుగా నిలిచిపోయాను.

"ప్రాచీన గ్రీకు దేవతల రాజకుమారీ, ఏదీ యవ్వనం?" అని
అడిగాను.
ఆమె నాకేమీ సమాధానం చెప్పకుండా
నన్ను తన రెక్కల మధ్య కూర్చోబెట్టుకుని,
ఎత్తైన ఒక పర్వత శిఖరానికి మోసుకుపోయింది.
విశ్వ రహస్యాలు రాయబడ్డ పుస్తకపుటల వలె,
నా కింద పరచుకున్న భూమినీ,
అందున్న సమస్త చరాచరాన్నీ చూశాను.
అవి చూసి, జీవిత రహస్యం గురించి యోచిస్తో
జీవిత చిహ్నాల చిక్కుల్ని విడదీయడానికి యాతనపడుతో,
విస్మయంతో ఆమె పక్కన నిలబడ్డాను.
దుఃఖభూయిష్టమైన దృశ్యాల్ని చూశాను.

ఆనంద దేవతలు, దుఃఖపిశాచాలతో యుద్ధం చేయడం,
వాటి మధ్య నిలబడ్డ మానవుణ్ణి ఆశ - నిరాశలు
అటూ - ఇటూ లాగడం వంటి విచారకరమైన దృశ్యాల్ని చూశా

ప్రేమ - ద్వేషం మానవ హృదయంతో ఆడుకోవడం చూశాను.
ద్వేషం, మనిషిని ప్రేరేపించి, సత్యానికి అతని కళ్ళు గుడ్డివి చేసి,
చెవులు మూసేస్తోవుండగా,
ప్రేమ, అతని అపరాధాల్ని దాచి "సమ్రత - కీర్తి - హెగడ్డ" అనే
సారాయితో అతనికి మత్తెక్కించడం చూశాను.

ఆదాము కుమారుడి బట్టలమీదపడి లాక్కున్నట్లు,
నగరం, తన మురికి పేటల్లో పసిబిడ్డవలె దాక్కోవడం చూశాను.

మానవుని దుఃఖానికి విచారిస్తున్న అందమైన హెలాల్ని
దూరంనుంచి చూశాను.
కపట జంబుకాలవలె మత గురువులు
కోపంతో మండిపడటం; అసత్య ప్రవక్తలు
మనిషి ఆనందానికి వ్యతిరేకంగా కుట్ర పన్నడం చూశాను.

విమోచనకోసం మానవుడు జ్ఞానాన్ని ఆహ్వానించడం
చూశాను. కాని, జ్ఞానం అతని రోదనల్ని వినిపించుకోలేదు.
ఎందుకంటే, నగర వీథుల్లో జ్ఞానం మానవునితో
మాట్లాడినప్పుడు అతడు దాన్ని ఖండించాడు.

లోభత్వపు గుంటల్లో తమ హృదయాలు
పాతిపెట్టబడి వున్నప్పటికీ, బోధకులు
ఆరాధనతో ఆకాశంవైపు చూడ్డం చూశాను.

తియ్యని మాటలతో ఒక యువకుడు ఒక కన్య హృదయాన్ని
జయించడం చూశాను. కాని, వారి ప్రేమలో నిజాయితీ
నిద్రపోతోంది. దైవత్వం, వారికెంతో దూరంగా వుంది.

"మోసం - కపటం" అనే అంగడి వీధుల్లో
ధర్మవిక్రేతలు సోమరిగా మాట్లాడుతూ,
తమ సరకుల్ని అమ్ముకోవడం చూశాను.
సహృదయుల, పూర్ణవిశ్వాసుల ఆత్మలతో,
వైద్యులు ఆటలాడుకోవడం చూశాను.

విజయ పతాకానికి తమ గతాన్ని గొప్ప చేస్తో,
విలువైన బట్టలతో వర్తమానాన్ని ఆరాధిస్తో,
భవిష్యత్తుకోసం విశేష వైభవంతో
శయ్యను సిద్ధం చేస్తో, అజ్ఞాని, జ్ఞాని పక్కన
కూర్చోవడం చూశాను.

దౌర్భాగ్యుడైన దరిద్రుడు పైరు వేయగా.
బలవంతుడు ఆ పంటను కోసుకుంటూ వుండగా;
"అక్రమం" ఆ పొలాన్ని చట్టం పేరుమీద
కాపలా కాయడం, చూశాను.

కాంతి సంరక్షకులు "నిష్కర్మ" అనే గాఢ సుషుప్తిలో
మునిగివుంటే,
"అజ్ఞానం" అనే దొంగలు, జ్ఞాన నిధుల్ని దోచుకోవడం చూశాను.

ఇద్దరు - ప్రేయసీ - ప్రియుల్ని చూశాను,
కరకు శబ్దాల్ని తప్ప, మీటడంరాని వాని చేతిలోని
వీణవలె, ఆ ప్రియుని చేతుల్లో వున్న ఆ స్త్రీని చూశాను.

వారసత్వంగా వస్తోన్న విశేషాధికారాలుకల నగరాన్ని,
ముట్టడించాలని, అల్ప సంఖ్యలో వేచివున్న జ్ఞాన శక్తులు,
త్వరలో అటూ - ఇటూ చెదిరిపోవడం చూశాను.

"స్వేచ్ఛ" ఒంటరిగా నడచివెళ్ళి, తలుపులు తట్టి,
రక్షణ అడగడం చూశాను. కాని, ఏ ఒక్కరూ దానికి
రక్షణ ఇవ్వలేదు.
పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ "దుబారా" గొప్పగా నడవడం,
గుంపు, దాన్నే "స్వతంత్రం" అని ఎంచి, సంతోషంతో
గట్టిగా అరవడం చూశాను.
గ్రంథాల్లో మతం పాతిపెట్టబడటం, సంశయం దాని స్థానంలో
నిలవడం చూశాను.
పిరికివాని ముసుగుపలె, మనిషి "ఓర్పు" వస్త్రాల్ని
ధరించడం, బద్ధకాన్ని "సహనం"గా, భయాన్ని "సౌజన్యం"గా
పిలవడం చూశాను.

అక్రమంగా, ఆహ్వాన రహితంగా ఒకడు
"జ్ఞానం" అనే భోజనాల పంక్తిలోకి చొరబడివెళ్ళి,
అవివేకంగా వాగుతోవుంటే,
తక్కిన అతిథులంతా నిశ్శబ్దంగా వుండటం చూశాను.

దుష్కార్యాలకు వెచ్చించేవాని చేతిలోనూ,
ద్వేషంతో, ప్రజల్ని ఆకర్షించేందుకు ఎరవలె
పెట్టుకున్న లోభిచేతిలోనూ, బంగారాన్ని చూశాను కాని,
వివేకవంతుని చేతిలో చూడలేదు.

నేను ఇవన్నీ చూసి బాధతో గట్టిగా అరిచాను,
"ఓ, రాజకుమారీ! ఇది నిశ్చయంగా భూమేనా?
ఇతడు నిశ్చయంగా మనిషేనా?" అని.

"నువ్వు ఏం చూశావో, అది ఆత్మ మార్గం.
ఆ మార్గం, వాడి రాళ్ళతో వేయబడి వుంది.

దానిపై ముళ్ళతివాసీ పరచబడి వుంది.
ఇది మానవుని ఛాయ మాత్రమే.
ఇది రాత్రి సమయం. కాని, ఆగు.
త్వరలో తెల్లవారుతుంది," అని అతి మధురమూ,
వేదనా భరితమూ అయిన కంఠ స్వరంతో అన్నది,
మెల్ఫోమిని.

ఆ తర్వాత ఆమె తన మృదు హస్తాన్ని
నా కళ్ళమీద కొంతసేపువుంచి, తీసింది.
నేను కళ్ళు తెరచేప్పటికి
యవ్వనం నా పక్కనుంచి నెమ్మదిగా నడచి వెడుతోంది.
"ఆశ" మాకు దారిచూపుతూ, మా ముందు నడుస్తోంది.

* * *

# 18

నా ప్రియతమా,
ఈ ప్రపంచంలో నిన్ను నేను చాలావరకు ఒంటరిగా వున్నాను.
ఆ, నా ఏకాంతం - చావంత నిర్దయగా వుంది.
పెద్దరాతి నీడలో పెరిగిన పువ్వు మాదిరిగా వున్నాను.
ఆ పువ్వు ఉనికి, జీవితానికి తెలియదు.
జీవితమంటే ఏమిటో, ఆ పువ్వుకి తెలియదు.

కాని, ఈనాడు నా ఆత్మ మేల్కొన్నది.
నా పక్కన నిలబడ్డ నిన్ను చూశాను.

పైకి లేచి, సమస్తాన్ని పరికించి సంతోషించాను.
భక్తితో నీ ముందు మోకరిల్లి ఆరాధించాను.

ఓ నా ప్రియతమా, ఉల్లాసకరమైన మృదు సమీర స్పర్శ,
నిన్న కఠినంగా తోచింది.
ఒక మంచుతెర భూమి ముఖాన్ని మూయడంచేత,
సూర్యకిరణ తీక్షత శక్తి హీనంగా వుంది; నిన్న.
మహాసముద్ర తరంగాలు, తుఫానులాగ గర్జించాయి.

అధిక ఆకలిగల రాబందువలె
అంధకార పిశాచాలు నిన్న నన్ను చుట్టేస్తో,
పైకిలేచి, కింద పడ్డాయి.
నా చుట్టూ వున్న వాటిని చూస్తోవుంటే,
నా పక్కన నిలబడి బాధపడుతున్న నా ఆత్మ తప్ప,
మరేదీ కనుపించలేదు.

కాని, ఈరోజు, ప్రకృతి తేజోస్నానం చేసింది.
గర్జించే సముద్ర కెరటాలు, శాంతించాయి.
మంచుతెరలు చెల్లాచెదురైనాయి.
నేనుఎటు చూస్తే అటు, జీవిత రహస్యాలు నా ముందు
స్పష్టంగా పరచుకుని వుండటం చూశాను.

నిన్న, నేను తమో హృదయాంతరాళంలో శబ్ద రహిత పలుకుని
యీ రోజు, కాల స్నిగ్ధాధరాల మీదపాటని.
ఇదంతా ఒక్క చూపుతో - ఒక్క మాటతో—
ఒక్క నిట్టూర్పుతో - ఒక్క ముద్దుతో—
ఒక్క క్షణకాలంలో జరిగిపోయింది.

ఓ నా ప్రియతమా, ఆ క్షణం—
నా హృదయ భవిష్యత్కాల ఆశలతో,
నా ఆత్మగత సంసిద్ధతను కలిపేసింది.
భూగర్భంనుంచి, పగటి కాంతిలోకి
అకస్మాత్తుగా ఆవిర్భవించిన తెల్ల గులాబి పువ్వులా
వుంది, ఆ క్షణం.

యుగయుగాల మానవజాతికి,
ఏసు ప్రభువు జననం ఎటువంటిదో,
ఆ క్షణం, నా జీవితానికి అటువంటిది.
ఆ క్షణం - ప్రేమతో - దయతో నిండివుంది.
ఆ క్షణం, అంధకారాన్ని తేజస్సుగా, దుఃఖాన్ని సంతోషంగా,
నిరాశను బ్రహ్మానందంగా మార్చింది.

ఓ ప్రియతమా, ప్రేమాగ్నులు అనేక ఆకారాల్లో,
రూపాల్లో దివినుండి భువికి దిగివచ్చాయి. కాని,
వాటి ముద్ర, ప్రపంచమంతటా ఒకే రీతిగా వుంది.
మానవజాతి మార్గాన్ని కాంతివంతం చేయడానికి,
స్వర్గంనుంచి దిగివచ్చి, మానవ హృదయాన్ని వెలిగించిన
ఆ చిరుజ్యోతే, తీక్షణంగా మండే దివిటీ మాదిరిగా
వుంది.

ఒక్క ఆత్మలోనే యావత్ మానవజాతి
ఆశలూ - భావాలూ ఇమిడి వున్నాయి.
ఓ నా ప్రియతమా, బంధ విముక్తుల్ని చేస్తానని

తమకు ప్రమాణం చేసిన ప్రవక్త రాకకై
యూదులు ఎదురు చూశారు.

దాహంగొన్న మానవ హృదయాలు,
"జూపిటర్ - మినర్వాల ఆరాధన" అనే ద్రాక్ష సారాయితో
ఇంకా ఎక్కువ కాలం సంతృప్తిపడలేవని
విశ్వాత్మకు అవగతమైంది.

దయలేని "అపోలో" దైవత్వం గురించీ,
అప్పటికే నశిస్తున్న "వీనస్" సౌందర్యం గురించీ రోమన్లు
యోచించారు.

తమ హృదయాంతరాళాల్లో అది వారికి అర్థంకాకపోయినా,
భూమిమీద ప్రతిదాన్ని శ్రేష్ఠమైనదిగా చేయగల
సర్వోత్కృష్టమైన ప్రబోధం కోసం ఆయా దేశాలవారు
ఆకలి - దప్పికలతో వున్నారు.
సూర్యకాంతిలో, జీవన వైచిత్రిలో తన తోటివారితో కలసి
ఆనందించడాన్ని మానవునికి బోధించే ఆత్మ స్వేచ్ఛ కోసం
వారు మిక్కిలి ఆతృతతో ఎదురు చూశారు.
ప్రేమాస్పదమైన ఆ ఆత్మ స్వేచ్ఛ ఒక్కటే,
భయంకాని, సిగ్గుకాని పడకుండా అగోచరమైన దాని దగ్గరకు
మానవుని సమీపవర్తుని చేస్తుంది.

అరణ్యాల అధిపతి "పాన్,"
గొర్రెల కాపరుల హృదయాల్ని భీతితో నింపుతున్నప్పుడు,
సూర్యమండల ప్రభువు "బాల్"

మత గురువుల నిర్దయ హస్తాల ద్వారా
నిర్భాగ్యుల - అధముల ఆత్మల్ని అణుస్తున్నప్పుడు,
హృదయ వాంఛలు దివ్యాత్మను సమీపించడానికి
భయపడుతూ సమస్త చరాచరం చుట్టూ పరిభ్రమిస్తున్నప్పుడు,
ఓ నా ప్రియతమా, అప్పుడు—
రెండు వేల సంవత్సరాల క్రిందట, ఇదంతా జరిగింది.

ఒక్క రాత్రిలో
ఒక్క గంటలో
ఒక క్షణ కాలంలో
విశ్వాత్మ పెదవులనుంచి
"జీవితం" అనే పవిత్ర పదం వెలువడింది.
రాత్రి క్రూరమృగాల బారినుంచి
తమ గొర్రెల మందల్ని కాపాడుకుంటున్న
గొల్లవాళ్ళ పశువుల శాలలో—
ఒక కన్య ఒడిలో, ఆ పవిత్ర పదం
ఒక పసిపాప దేహంగా రూపొందింది.
నగ్నుడై, గడ్డి తొట్టెలో పడుకుని నిద్రిస్తున్న
ఆ పసిపాపను, గొర్రెల కాపరులు అమితాశ్చర్యంతో
చూశారు.

భారవంతమైన హృదయాల, ఆకలిగొన్న ఆత్మల
సింహాసనంమీద ఆసీనులైనట్లు
తన తల్లి చింకి గుడ్డల పొత్తిళ్ళలో - శిశు రూపంలో

వున్న ప్రభువు; అటూ - ఇటూ వూగుతూ కూర్చున్నారు.
ఆయన - ఆ శిశు చక్రవర్తి—
తన నమ్రతతో జూపిటర్ చేతులనుంచి

రాజ్యాధికారదండాన్ని బలవంతంగా లాక్కుని,
గొర్రెల్ని కాచుకుంటున్న ఒక పేద గొల్లవానికి ఇచ్చారు.

మినర్వానుంచి జ్ఞానాన్ని తీసుకుని,
వలను బాగుచేసుకుంటున్న ఒక పేద జాలరి
హృదయంలో దాన్ని వుంచారు.

తన స్వంత దుఃఖాల ద్వారా "అపోలో" నుంచి
ఆనందాన్ని లాక్కుని, రోడ్డు పక్కన భగ్నహృదయుడై
పడివున్న బిచ్చగానిపై దాన్ని వుంచారు.

వీనస్ నుంచి సౌందర్యాన్ని తీసుకుని,
క్రూరంగా అణచే వానిముందు వణకే పతిత
ఆత్మలో దాన్ని కుమ్మరించారు.

"బాల్"ని రాజ్యభ్రష్టుణ్ణి చేసి, అతని స్థానంలో—
నుదుటి చెమటతో భూమిని దున్ని విత్తనాలు చల్లే
నమ్రుడైన కర్షకుని నియమించారు.

ఓ ప్రియతమా,
నిన్న నా ఆత్మ, ఇజ్రాయేల్ జాతులమల్లె లేదా?
కాల దాస్యం నుంచీ, రాత్రి నిశ్శబ్దంలో
నేను వేచి వుండలేదా?

గత కాలపు రాజుల మల్లె, నేనూ ఎంతో హృదయార్తినీ
ఆత్మ ఆకలినీ భరించలేదా?
అడవి మధ్య, దారితప్పిన బిడ్డవలె, జీవిత బాటమీద
నడవలేదా, నేను?
ఏ పక్షీ వెతకని, ఏ మూల శక్తీ చీల్చి, మొలకెత్తింపలేని
రాతిమీదపడ్డ విత్తనంవలె లేదా, నిన్న నా జీవితం?

ఓ ప్రియతమా,
నా కలలు, చీకట్లో దాక్కొని,
సమీపిస్తున్న పగటికాంతిని చూసి భయపడుతున్నప్పుడు
ఇదంతా జరిగింది.
దుఃఖం - నా హృదయాన్ని చీల్చినప్పుడు, ఆశ-దాన్ని బాగుచేయ
యత్నించినప్పుడు - ఇదంతా జరిగింది.

ఒక్క రాత్రిలో—
ఒక్క గంటలో—
ఒక క్షణ కాలంలో—
దివ్య తేజోవలయ కేంద్రంనుంచి,
దివ్యాత్మ క్రిందికి దిగిచ్చి,
నీ హృదయ, నేత్రాలతో నా వంక చూసింది.
ఆ చూపునుంచే, ప్రేమ ఉద్భవించింది.
ఆ ప్రేమ, నా హృదయాన నివసించ ఎంచింది.

మహనీయమైన ఆ ప్రేమ,
నా భావాల బట్టల మడతల్లో గట్టిగా చుట్టబడివుంది.

అది - నా దుఃఖాన్ని సంతోషంగా,
నా నిరాశను, పరమానందంగా,
నా ఒంటరితనాన్ని స్వర్గంగా మార్చింది.

"ప్రేమ" అనే గొప్ప ప్రభువు, నిర్జీవమైన నా ఆత్మకు
తిరిగి నవ చైతన్యాన్ని ఇచ్చారు.
కన్నీళ్ళతో గుడ్డివైన నా కళ్ళకు కాంతిని ఇచ్చారు.
నిరాశా గుండం నుంచి, మహోన్నతమైన
ఆశా సామ్రాజ్యానికి, నన్ను ఎత్తారు.

ఓ, నా ప్రియతమా!
నా పగటి వేళలన్ని రాత్రులుగా గడిచాయి.
కాని, చూడు! తెల్లవారింది.
త్వరలోనే సూర్యోదయం అవుతుంది.
పసిబిడ్డగా వున్న ఏసు ప్రభువు శ్వాస
స్వర్గాన్ని నింపి, ప్రపంచమంతా విస్తరించింది.
ఆ పసిపాప చేతులు నన్ను పెనవేసుకుని,
నా ఆత్మను ఆలింగనం చేసుకోవడం వల్ల,
ఒకప్పుడు దుఃఖమయంగా వున్న నా జీవితం,
ఇప్పుడు ఆనందంతో పొంగి పొరలుతోంది.